పాఠకులకు

జ్యోతి నవంబరు 77 సంచికతో

అందిస్తున్న

పూర్తి నవల



# డుగుల విషాదం

పాలకోడేటి సత్యనారాయణరావు

'ఈ వంతెన దాటాక ఇరవై నిమిషాలు....' అనుకొన్నాడు అతను మళ్ళీ ఒక్కసారి.

రైలు గోదావరి వంతెన మీద చప్పుడు చేసుకొంటూ పోతోంది.

చీకటి. చుట్టూ చీకటి. వంతెనకింద నీళ్ళే వున్నాయో, ఇసుక దిబ్బలే వున్నాయో తెలీదు. రైల్లోంచి కిందకు దూకితే....ఏమో. ఎక్కడ పడతాడో చెప్పటం కష్టం. అదే ఆలోచించినట్లుగా అతను మళ్ళీ వాచీకేసి చూసి అనుకొన్నాడు—'ఈ వంతెన దాటాక ఇరవై నిమిషాలు....'

అతను ఎదురుగా పెట్టెకేసి చూశాడు. పెట్టె చిన్నదే—ఫర్వాలేదు. తనొక్కడే ఎత్తేయగలడు. పెట్టెమీద ఏదో పేరు—ఎప్పుడో రాసినట్లుగా వుంది. పెయింట్ కొంచెం పోయి, అస్పష్టంగా కనబడుతోంది.

రైలు వంతెన దాటుతున్నది. దాటేసి తన విజయాన్ని సూచించటానికి కాబోలు, ఓసారి విజిల్ వేసింది. గట్టుమీదకు వచ్చాక ఆనందంతో మరింత ఉత్సాహంతో ఉరకలు వేయ నారంభించింది. పైనుంచి రోడ్డు బ్రిడ్జిమీద లైట్లు దిగాలుగా అక్కడే నిలబడిపోయి చూస్తున్నాయి.

అతను ఒకసారి కిటికీలోకి చూశాడు—కిటికీకి ఉన్న అద్దం లోంచి ఆవిడ కనిపిస్తూనే వుంది. ఆవిడ ముఖానికి పుస్తకం అడ్డు ఉందే కానీ, ఆ ముఖం అద్దంలోంచి కనిపిస్తూనేవుంది.

అతని ఆలోచనలన్నీ ఒకసారి ఆవిడ మీదకు మళ్ళాయి — ఆవిడ సామర్లకోటలో ఎక్కినట్లుగా వుంది. ఎక్కిన వెంటనే వచ్చి, ఆ కిటికీ పక్కన కూర్చుంది. అతనికి కిటికీ పక్కస్థలం అంటే ఇష్టం వున్నా, అక్కడ కూర్చుంటే పెట్టె కనపడదు. అందుకే ఇష్టాన్ని పక్కకు నెట్టి, ఆ పెట్టె కనపడేటట్లుగా అక్కడే కూర్చుండి పోయాడు.

తనతో తెచ్చుకొన్న పెట్టెలోంచి పుస్తకం తీసింది. తీసి, తలెత్తుతూంటే తను కనబడ్డాడు. ఇద్దరి కళ్ళూ ఒక్కసారి కలుసు

కొన్నాయి. ఆ కలయిక....ఆ కలయికలోనే ఏదో తడబాటు—ఒక్కసారి ఇద్దరివీ కళ్ళు వాలిపోయాయి.

తీసిన పుస్తకం తీసినట్లే వుంది. నిలచిన చూపు నిలిచినట్లే వుంది. కానీ, దృష్టంతా తనమీదే ఉన్నట్లుంది.

అతను ఇబ్బందిగా కదిలాడు ఒకసారి.

అలా అయితే తను అనుకొన్నట్లుగా తన పని జరగటం కల్ల. ఆవిడకు తనమీద పడిందేం దృష్టి?

ఒకసారి అతనికి నవ్వొచ్చింది—అయివుండదు. తనకు అందర్నీ గమనించడం అలవాటు. అలాగే ఆవిడనూ గమనించాడు. అంతేకానీ. ఆవిడ తనను పరిశీలించటం కేవలం తన ఊహే అనుకొన్నాడు అతను. అలా అనుకొన్నాక మనసు కుదుటబడింది.

రైలు ఏదో స్టేషన్ వస్తోందన్నట్లుగా విజిల్ వేసింది—బహుశా బ్రాహ్మణగూడెం అయివుంటుంది, కాకపోతే చాగల్లా?—ఏమో!!

అతనిదృష్టి ఆమె మీద పడింది మళ్ళీ— తెల్లని సాదాచీర, ఆ చీరమీద పెద్దపెద్ద ఎర్రని గళ్ళు, కింద ఎర్రని అంచు. తెల్లని జాకెట్—తెలుపు ఆవిడకు ఇష్టమైన రంగు కాబోలు!—మనిషి అందంగా ఉన్నట్లే జమ—అద్దంలోంచి కాక మామూలుగా, తెరల వెనుకనుంచి కాక, ముఖాముఖిన ఒకసారి చూస్తే బాగుండును, అనుకొన్నాడతను.

అతని ఆలోచనలకు, కోరికలకు అంతరాయం కలిగిస్తున్నట్లుగా వెనుకనుంచీ దగ్గు. తెరలుతెరలుగా దగ్గు.

ఉలికిపడ్డాడతను—ఇప్పటికిది అప్పుడే రెండోసారి!—తన కోరికలకు కళ్ళెంవేస్తూ, తన పనికి అడ్డు కలిగిస్తూ వస్తున్నట్లున్నాడు ఆ ముసలాడు— అనుకొని అటుకేసి తిరిగేసరికే రెడీ — ఆ ముసలాడు.

ముఖంలో తనకున్న నిర్లక్ష్యాన్ని అసహ్యాన్ని ప్రదర్శిస్తూ ప్రక్కకి జరిగాడు.

ముసలాడు వచ్చి ఆమె పక్కనే కూర్చున్నాడు. పెట్టెమీద

తనకేదో హక్కు ఉన్నట్లుగా కాలుపెట్టాడు దానిమీద।

"ఆ పుస్తకం ఇలా ఇస్తారా? ఒక్కసారి చూసి ఇచ్చేస్తా?—" కావాలనే అడిగాడు.

పుస్తకం అందించిందావిడ. యిపుడు మబ్బులన్నీ తొలగి పోయి ఆమె ముఖం అందంగా కనుపిస్తోంది.

పుస్తకం అట్టమీద ఎవరో స్త్రీ తనకున్న అందాన్నంతా అసహ్యంగా ఒలకపోస్తోంది. పుస్తకం లోపల ఏముందోగానీ, అట్టమీద మాత్రం ఇలాగుంది। అనుకొంటూ పేజీ తిరగేశాడు. మొదటి పేజీ పైన చివర 'నీల' అని రాసివుంది.

నీల। — ఎంత బాగుందో ఆమె పేరు అనుకొన్నాడు అతను. మనిషికి తగ్గట్లుగా అందమైన పేరు.

"మీ పేరు నీలా?" అని అడిగాడు మళ్ళీ.

ఒకసారి ఆవిడ అదోలా చూసి అంది——"కాదు, నా పేరు వినీలరేఖ——"

ఇతనికి నవ్వొచ్చింది——నీల కాదుట, వినీలరేఖట। అంటే ఏమిటో... ?

"ఇక్కడ నీల అని ఉంటే...."

"అది మా తమ్ముడు రాసింది" అని క్షణం ఆగి అంది—— "మీరు ఎక్కడిదాకా వెడుతున్నారు?"

తడబడుతూ అన్నాడు। "సికిందరాబాద్——"

"నేనూ అక్కడికే।——"

——పొరబాటున అన్నాడు సికిందరాబాద్ అని। ఒక్కోసారి అబద్ధం చెప్పాలన్నా ఎందుకో చెప్పలేం——నోరు విప్పితే పొరబాటున నిజం వచ్చేసింది——

"నా పేరు మనోహర్——" అన్నాడు అతను.

రైలు నెమ్మదిగా వెడుతూ, స్టేషన్ వస్తోంది, ఆగుతున్నా సుమా అని చెపుతోనే ఉంది.

అతనికి ఇబ్బందిగా ఉంది——రైలు ఆగి, మళ్ళీ కదిలేలోపున ——ఈ ముసలాడు....

ఏమిటో—ఈరోజు ఇలాగే జరిగేటట్లుగా ఉంది. లేచిన వేళ బాగున్నట్లుగాలేదు. ఏం జరుగుతుందో ఏమో!

రైలు నడుస్తూ నడుస్తూ ఆగిపోయింది. చుట్టూ చీకటి. అంటే సిగ్నల్‌కోసం ఆగిపోయినట్లుంది. ఆ సిగ్నల్ పడేలోపు తనకూ సిగ్నల్ పడితే....ఆ అవకాశం ఉన్నట్లుగా లేదు.

పుస్తకం మూసేస్తూ, పక్కన పడేసి, లేచివెళ్ళి తలుపు దగ్గర నిలబడ్డాడు మనోహర్. నిడదవోలు స్టేషన్ దూరంనుంచి మినుకు మినుకు మంటూ రాబోయే రైలుకోసం వేచి చూస్తోంది. ఈ స్టేషన్‌కూడా దాటిపోతే—మళ్ళీ తాడేపల్లిగూడెం....ఏమిటో, ఈ వరస చూస్తోంటే తను సికిందరాబాద్ నిజంగానే వెళ్ళాలా ఏం? కానీ, సికిందరాబాద్ వెడితే....ఇలా ఓటమితో వెళ్ళటం తల కొట్టేసినట్లుగా ఉంది. ఊహూ—కాదు, ఈ స్టేషన్‌లోనే....రైలు కదిలేలోపునే...ఆ పెట్టె తనదయి...ఆ పెట్టె చిన్నపెట్టె! కానీ... ఏం ఉండి ఉంటుంది అందులో?

—తెలీదు.

కానీ ఊహించుకోవటంలో ఎంత థ్రిల్ ఉంటుంది!

మనోహర్‌కు ఆ క్షణంలో తునిలో ప్లాట్‌ఫారం మీద తను వెడుతోంటే విన్న మాటలు గుర్తొచ్చాయి: "జాగ్రత్త నాన్నా—వద్దంటే విన్నావుకాదు-ఇక్కడినుంచీ ఏలూరుదాకా...పెట్టె జాగ్రత్త సుమా! ఆ పెట్టెపోతే కొంప మునిగిపోతుంది—" ప్లాట్‌ఫారం మీద ఆ మాటలు అతన్ని ఆపేశాయి. ఒకసారి పెట్టెకేసి చూశాడు. పెట్టె చాల పాతది. అయితేనేం, ఏపుట్టలో ఏపాముో అంటారు. ఇలాటి పెట్టెలో...ఊహించటం కష్టం. అయినా...ఆ పెట్టె తన స్వంతం చేసుకొంటే—ఊహించుకోవాల్సిన అగత్యం ఉండదు.

మనోహర్ పక్కనే కిటికీ దగ్గరగా చేరాడు. ప్రక్కనే కిటికీ దగ్గర్నుంచి ఆ తండ్రీ కొడుకుల మాటలు వినిపిస్తూనే ఉన్నాయి స్పష్టంగా—ఆ ముసలాడు కొడుకు చెప్తోంటే వినకుండా బయలు దేరాడు. కొడుక్కు ముసలాడికంటే, ఆ పెట్టె అంటేనే ఎక్కువ ఇష్టం. కారణం—ఆ పెట్టెలో ఉండేది ఏదో చాలా విలువ అయి

నదే అయివుంటుంది—

తుని స్టేషన్‌లో రైలు కదులుతోంటే మనోహర్ కూడా ఆ పెట్టెలోకే ఎక్కి ముసలాడు కూర్చున్న స్థలానికి ఎదురుగా కూర్చున్నాడు.

ఆ ముసలాడు రైలుతో సమంగా ఏదో బరువులాగుతున్న ట్లుగా ఒకటే ఆయాసపడుతున్నాడు. రైలు విజిల్ వేసినట్లుగా, మధ్య మధ్యలో దగ్గులు. వీటన్నిటికి తోడు రైలు నీళ్లు వదిలి పెడు తున్నట్లుగా, వీడూ—ప్రతిపది, పదిహేను నిమిషాలకోసారి బాత్ రూంలోకి వెళ్ళివస్తూనే ఉన్నాడు.

—మనోహర్‌కు పెద్ద కష్టమైన పనిలా తోచలేదు ఇది. ముసలాడు బాత్‌రూంకి వెళ్ళి తిరిగి వచ్చేలోగా, పెట్టి కొట్టేయటం తేలిక!

కానీ...వినాయకుడి పెళ్ళికి వెయ్యి విఘ్నాలుట!—తన పనికి రేఖాజీగారు అడ్డుపడ్డారు!

పడ్డారా!—తెలీదు. కానీ పడ్డట్టే ఉంది. ఆమె పద్ధతి చూస్తోంటే, ఆమెకు తనంటే అనుమానం అయినా అయి ఉండాలి. కాకపోతే అభిమానం అయివుండాలి. ఏదయినా తన పనికి ఇంక మంగళహారతే!

మనోహర్‌కు మనసంతా చీకాకుగా ఉంది—రైలు కదిలి నిడదవోలు దాటేలోగా, ముసలాడు ఓసారి బాత్‌రూంలోకి వెడితే, ఆవిడ ఓసారి అదమరిస్తే...ఏమిటో అన్నీ పెద్ద ఇబ్బందుల్లాగే ఉన్నాయి.

రైలు కదిలింది—నెమ్మదిగా నెమ్మదిగా ఏదో ఆలోచిస్తు న్నట్టుగా, తాగినవాడు ఆలోచించి వేసే అడుగుల్లాగా...చక్రాలు ఎందుకో మొరాయిస్తోంటే—ముందుకు లాగుతున్నట్లుగా—రైలు కదిలింది.

మనోహర్ ఆఖరి ప్రయత్నం అన్నట్లుగా లోపలికి వచ్చాడు —ముసలాడి కాళ్ళు ఆ పెట్టెమీదే ఉన్నాయి. ఆవిడ కళ్ళు తనమీదే ఉన్నాయి.

మనోహర్ నీరసంగా తన సీట్లో కూలబడ్డాడు.

రైలు నిడదవోలు స్టేషన్‌లోకి వచ్చి, భారంగా ఆగింది. మనోహర్ లేవబోయేసరికే ఎదురుగా అయిదారుగురు టీటీఈలు— రైల్వే పోలీసులు...మనోహర్ ముఖం ఒకసారి జేవురించుకొని పోయింది.

—తప్పదు—ఈసారికి తను దొరికిపోవటం తప్పదు!!

టీటీఈ దగ్గరకొచ్చి అడిగాడు టికెట్ చూపించమని—ముఖం మీద నవ్వు పులుముకొంటూ జేబులో చెయ్యిపెట్టాడు.

కొనని టిక్కట్టు తన జేబులో ఉండటకల్ల అని తెలిసినా, జేబులో చెయ్యిపెట్టి వెతికాడు.

టిక్కట్టు లేదు!

కుడిచేత్తో కుడిజేబు, ఎడమచేత్తో ఎడంజేబు—రెండు చేతులతోనూ వెతికాడు. మనసులో నవ్వు పెల్లుబికివస్తోన్నా, మరో పక్కనుంచీ ఏం జరుగుతుందో నన్న దిగులు ఆవరిస్తోంటే...మనోహర్ నీరసంగా నిలబడ్డాడు!

"మిస్టర్, టిక్కెట్ ప్లీజ్..."

ఆమె—వినీలరేఖ!—తనకేసి చూస్తోనే ఉంది.

"పోయినట్లుంది."

"ఉందా? పోయిందా??"

"లేదు—"

"అయితే ఫైన్ కట్టాల్సి ఉంటుంది-చెప్పండి. ఎక్కణ్ణుంచి వస్తున్నారు?"

"తుని!—"

"ఎక్కడివరకూ?"

"...సికింద్రాబాద్—" అన్నాడు మనోహర్.

ఫైన్ ఎంతకట్టాలో చెప్పాడు టీటీఈ-మనోహర్ గుండెల్లో రాయిపడింది-తనదగ్గర అంతలేదు! తునిలో కొట్టేసిన పర్సులో ఎంత ఉందో ఏమో తెలీదు. అదితీస్తే ఈక్షణంలో తనకేనష్టం. తియ్యకపోయినా...ఏమో, చూద్దాం-జేబులోంచి తనదగ్గర ఉన్న

డబ్బుతీసి. అతని చేతిలో పెట్టాడు.

"ఇంకా అయిదు రూపాయలు కావాలి!" అన్నాడు అతను.

క్షణం ఆగి అన్నాడు మనోహర్— ఇంక "లేవండి.''

"అయితే వరంగల్‌లో దిగండి—" అంటూ రసీదు రాయ బోయాడు అతను.

మనోహర్ ఊహించినట్లుగానే అంది ఆవిడ—" ఆ అయిదూ నేను ఇస్తాను. టికెట్ సికింద్రాబాద్ వరకూ ఇవ్వండి."

—వాళ్ళు వెళ్ళిపోయాక అంది: "టిక్కెట్ జాగ్రత్తగా ఉంచుకోవాలండీ! పోతే ఎంతకష్టమో తెలిసిందిగదా!—"

నవ్వుతూ అన్నాడు మనోహర్:"పోతుందని ముందే తెలిస్తే జాగ్రత్తగానే దాచేవాణ్ణి. అది తెలీకే..."

ఆవిడ నవ్వింది. పర్సులోంచి ఇంకో పదిరూపాయిలనోటు తీసియిస్తూ అంది. "ఇది జేబులో వుంచుకోండి. ప్రయాణాల్లో డబ్బులు లేకపోవడం అనేది ఎంత ఇబ్బందో నాకు తెలుసు:"—

"డబ్బు యిలా ఇస్తున్నారు గదా—నా పేరు తప్ప ఇంకేమీ తెలీదే మీకు!"

"మీ పేరు తెలియకపోయినా యిచ్చేదాన్ని!"

"అంటే?"

"అంటే—కష్టపడటం అంటే ఏమిటో తెలుసు నాకు. ఆ క్షణంలో సహాయం పొందితే అదెంత విలువైనదో తెలుసు:"

"మీ ఋణం నేను తీర్చుకోకపోతే...."

"పోనీండి—పదిహేను రూపాయలు, అంతేగదా!" అని క్షణం ఆగి అంది మళ్ళీ! "ఇంతవరకూ నేను ఇలా డబ్బేమీ పోగొట్టుకోలేదు."

మనోహర్ నవ్వుతూ అన్నాడు. "ఈ సారి పోగొట్టు కొంటే...."

వినీలరేఖ నవ్వుతూ అంది—"పోనీ అన్నాగదా!"—

"అలా అనుకోకండి. మీ డబ్బు తెచ్చియిచ్చేస్తా! మీ సహాయానికి చాలా థాంక్స్!—ఈ సారి నేను డబ్బు ఇచ్చేయకపోతే,

మీరు ఇంకోసారి సాయం చేస్తారో, చెయ్యరో!—"

"చెయ్యటం నా కోరిక. ఒక్కోసారి చెయ్యలేకపోవటం నా దౌర్భాగ్యం!" అంది పినీలరేఖ.

—మనోహర్ ఏమీ అనలేదు. అతడికి ఆ రోజు అంతే రెండు రకాల భావాలు ఏర్పడ్డాయి—ముసలాడు అదృష్టవంతుడు. ఇంత పరిచయం తర్వాత, ఆవిడముందు తను తప్పుచేయగలగటం కలలోని మాట!

ఇకతను....ఈవిడతో పరిచయం! మంచివాళ్ళు ఒకరిద్దరు తనకు అన్నివిధాలా అవసరం!

—రైలు సికింద్రాబాద్ చేరుకొనేసరికి, తెల్లగా తెల్లవారుతోంది.

రైల్లోంచి దిగబోయే ముందు ఆవిడకు తన అడ్రసు రాసిస్తే, ఆవిడ తనయింటి అడ్రసు రాపియిచ్చింది— "డబ్బు తిరిగి యివ్వటానికే అక్కర్లేదు, ఊర్కేనే రండోసారి!" అందావిడ.

"తప్పకుండా వస్తా!" అంటూ పెట్టె దిగుతోంటే అడిగింది మళ్ళీ—"మీ లగేజ్....?"

"బ్రేక్‌వాన్‌లో వుంది!—" అంటూ తడుముకోకుండా అబద్ధం చెప్పాడు మనోహర్.

ఆవిడకు మరోసారి కృతజ్ఞతలు చెప్పి, ఓవర్ బ్రిడ్జ్ కేసి నడుస్తూ బ్రేక్‌వాన్‌లోకి తొంగి చూసాడు—అందులోంచి కోళ్ళతో నిండిన బుట్టలు ఓ ఇరవై వరకూ వున్నాయి. 'తన లగేజ్'ని చూస్తే ఆవిడ ఏమనుకుంటుందో అని నవ్వుకుంటూ ముందుకు నడిచాడు మనోహర్.

## 2

జేబులోంచి పర్సుతీసాడు మనోహర్. ఆ పర్సులో ఎవరిదో అడ్రసు ఉండాల్సిన చోట తన అడ్రసువున్న కాగితం ఉంది. ఆ పర్సు మనోహర్ చేతిలోకి రెండేళ్ళ క్రితం వచ్చింది—పర్సుమీద బొమ్మ అందంగా వుంది. ఆ బొమ్మ అందానికి మురిసే, దొంగతనం చేసిన పర్సుల్లో డబ్బులే తప్ప పర్సులు ఉంచుకోకూడదనే నిబం

ధనను ఒకసారి సడలించుకొని, ఆ పర్సు తన దగ్గరే వుంచుకొన్నాడు మనోహర్.

పర్సులో, తన అడ్రసు రాసిన కాగితం కిందవున్న కాగితం తీశాడు—దానిమీద ఆ రోజు ప్రయాణం ఆఖరున ఆవిడ రాసి ఇచ్చిన అడ్రసు వుంది.

అడ్రసు ప్రకారమే వచ్చి అక్కడ నిలబడి, ఒకసారి వెనక్కి తిరిగి చూశాడు—ఆవిడ చెప్పినట్లే రెండు ఎద్దుల బొమ్మలు ఎదురింటి గోడమీద వున్నాయి.

ముందుకు నడిచి తలుపుతట్టాడు మనోహర్. ఒకటి రెండు క్షణాల తర్వాత ఎవరో వచ్చి తలుపు తీశారు.

"ఇక్కడ వినీలరేఖగారని...." ఆగిపోయాడు మనోహర్.

"రండి, ఇదే ఆవిడ ఇల్లు. కూర్చోండి" అందావిడ—మనోహర్ అక్కడేవున్న కుర్చీలో కూర్చున్నాడు—గదంతా ఒకసారి కలియజూశాడు. చిన్నగది—బహూశా వెనుక ఇంకో గది వుంటుంది. అది వంటిల్లు అయివుండొచ్చు — ఇదంతా తను కూర్చున్న గదిలో ఏ రకమైన వంటసామగ్రి లేకపోవడంతో మనోహర్ ఊహించాడు. ఈ గదిలో—గోడమీద ఓ పక్క గీతోపదేశం ఫొటోవుంది. దానికింద ఓ చిన్న స్టాండు. దానిమీద అగరొత్తుల స్టాండు—కాలిపోయిన అగరొత్తులు కొన్ని. ఫొటోకు కొంచెం పక్కగా ఓ బట్టలతాడు. తాడుమీద పొందికగా పెట్టిన అయిదారు చీరలు. కింద ఓ రెండు పెట్టెలు. ఇల్లంతా ముచ్చటగా వుంది. చిన్న ఇంట్లోనే జాగ్రత్తగా వుండటం చూస్తోంటే, జీవితం అంటే లక్ష్యం ఉన్నట్టే కనిపిస్తోంది—అనుకొన్నాడు మనోహర్.

అయిదారు నిమిషాల తర్వాత నవ్వుతూ బయటకొచ్చింది వినీలరేఖ.

"నమస్కారం—" అన్నాడు మనోహర్ పలకరిస్తూ.

ప్రతినమస్కారం చేసింది వినీలరేఖ.

"ఆలస్యం అయిపోయింది, క్షమించండి. రోజూ వద్దామనుకుంటూనే నిర్లక్ష్యకొద్దీ...."ఆగిపోయాడు మనోహర్.

"ఫర్వాలేదండీ!—ఓ వారం అంటే పెద్ద ఆలస్యం కాదుకానీ మీరు ఇంతకన్నా మునుపే వస్తారనుకొన్నాను."

"నయం. ఇప్పటికైనా రాగలిగాను. లేకపోతే మీ డబ్బుకు ఖర్చు రాసేసుకొనేవారన్నమాట."

"ఛ—మనిషికీ మనిషికీ మధ్య నమ్మకం అనేది ఉండాలి కానీ మిగతా అంతా సెకండరీ. మీరివాళ డబ్బు ఇచ్చేసినంత మాత్రాన మీరంటే మంచి అభిప్రాయం కలగటం కానీ, లేకపోతే చెడు అభిప్రాయంలో వుండిపోవటంగానీ.... నేను ఎందుకో ఒప్పుకోను."

మనోహర్ నవ్వుతూ అన్నాడు—"ప్రపంచం అంతా డబ్బు చుట్టూ తిరుగుతోంటే, మీరొక్కరూ యిలా...."

"ప్రపంచం అంతా అనకండి మన పరిచయంలో ఎక్కువ మంది ఎవ్వరైతే, అంతా అదే అనుకోగా పద్ధతి మనది. మీకున్న ప్రపంచం యావత్తూ ధనంచుట్టూ తిరిగితే, నా ప్రపంచం నమ్మకం చుట్టూ తిరుగుతోంది. ఒకే ప్రపంచం అయినా దృక్పథాలు మాత్రం వేరు."

మనోహర్ నవ్వేశాడు—"మీరు నా జీవితంలోకి తొంగి చూసిన కొత్తతరహా వ్యక్తి."

"నాకు మీరూ అంతేనేమో అని ఆలోచించి చూడండి—పోనీండి. నా దృష్టి నాది. మనుషుల మీద నమ్మకంతో బతికేవాన్ని నేను. అందుకే మీకు ఆ క్షణంలో అలా డబ్బు యివ్వగలిగాను. ఆ యిచ్చే క్షణంలో ఆ డబ్బు తిరిగి వస్తుందా రాదా అని ఆలోచించనే లేదు."

"పోనీండి—మీ డబ్బు, యిదిగో తిరిగి వచ్చింది—" అంటూ పర్సులోంచి పదిహేను రూపాయలు తీసి అందించాడు మనోహర్.

నవ్వుతూ అందుకొంది వినీలరేఖ. "ఉండండి. కొంచెం కాఫీ తెస్తాను!" అంటూ వెళ్ళబోయిన ఆవిడను ఆపుతూ అన్నాడు మనోహర్—"చూడండి...."

"....వినీలరేఖ...." అందించింది తన పేరును.

"పేరు తెలుసు. కానీ ఏమనిపిలవాలా అని ఆలోచిస్తున్నాను-"

"నన్ను వినూ్న అంటారు కొందరు. నీలా అంటారు, రేఖా అంటారు. మీ ఇష్టం. ఎలా పిలిచినా పలుకుతాను."

"నేను మిమ్మల్ని రేఖాజీ అంటాను. ఓ కే?—నాకు కాఫీ వద్దు, టీతెండి. వీలైతే!" అన్నాడు మనోహర్.

—టీ తాగుతూవుంటే అడిగింది వినీలరేఖ — "ఈ ఊర్లో ఏం చేస్తుంటారు మీరు?"

మనోహర్ ఉలిక్కిపడ్డాడు — ఈ ప్రశ్న తన జీవితంలోకి తొంగిచూపినప్పుడల్లా అతనికి ఎంతో భయం. ఏమని సమాధానం చెప్పాలి? ఒకసారి ఒకరికి చెప్పిన జవాబు, మళ్ళీ యింకొకరికి చెప్పటం అనేది ఇంతవరకూ జరగనేలేదు.

"చెప్పండి ఏం చేస్తుంటారు?"

"గుడ్లు పెడుతుంటాను!"—నవ్వుతూ అన్నాడు మనోహర్-మనసులో, తను సికిందరాబాద్ స్టేషన్‌లో దిగినపుడు కనపడ్డ కోళ్ళ బుట్టలు గుర్తుకొచ్చి.

ఆశ్చర్యపోతూ అడిగింది ఆవిడ "ఏమిటీ?"—

"మాకు పౌల్ట్రీఫాం వుంది. కోళ్ళు పెట్టే గుడ్లను నేను షాపులో పెడతాను."

అంటే....ఓ—! నవ్వింది. "ఇంక నా సంగతి—ఇదుగో ఇక్కడే వున్న స్కూల్లో టీచరు ఉద్యోగం. పొద్దున వెళ్ళటం, సాయంత్రం రావటం...."

"మంచి ఉద్యోగం అండీ—జీతం కొంచెం తక్కువే అయినా బాధ్యతగా వుండాల్సిన వుద్యోగం."

"నా జీతం నాకు సరిపోతూనే ఉంటుంది. అంతో ఇంతో మిగలటం కూడా కద్దు."

"అది దానధర్మాలకూ, మనుషులమీద నమ్మకానికీ ఉపయోగిస్తారు కాబోలు!"

వినీలరేఖా నవ్వింది—ఆ నవ్వు మనోహర్ గుండెల్లోకి ఎక్కడికోవెళ్ళి సూటిగా తగిలింది—ఎక్కడికి వెళుతోంది తమ పరిచయం?

యాదృచ్ఛికంగా కలవటం జరిగింది. ఆ కలయిక యింత మనో హరంగా ఉంటుందని మనోహర్ అనుకోలేదు. కానీ—ఈ పరిచయం ఇలా ఇలా పెరిగి....చూద్దాం. ఏం జరకపోబోతోందో అనుకొన్నాడు మనోహర్.

"మంచితనం అంటే నమ్మకం వుండాలి అండీ ఎవరికైనా మనిషి అంటే నమ్మకము అపుడే కలుగుతుంది!"

"మంచిమీద నమ్మకం మంచివాళ్ళకే వుంటుంది."

"నేను మంచిదాన్ని అవునో కాదోగానీ, మీరు మాత్రం అవును అనే తెలిసిపోయింది. కనీసం నాలోవుండే నమ్మకం మాత్రం చావలేదు" అంది వినీలరేఖ.

మనోహర్. వినీలరేఖకేసి చూశాడు — మనిషి మనసు స్వచ్ఛంగా తేటనీరులా వుంటుంది కాబోలు! ఆ తేటనీటిలోని స్వచ్ఛత ఆమె ముఖంలో కూడా స్పష్టంగా ప్రతిబింబిస్తూవుంది.

మనోహర్ ఓ క్షణం ఎందుకో ఆమెముందు తను చాలా అల్పుడిగా అయిపోయినట్లుగా భావించాడు.

శిఖరాల ఎత్తునవున్న వినీలరేఖ—తన రేఖాజీ!—

అగాధాల అడుగున తను—ఎక్కడ ఈ రెంటికి పొంతన:- అది. తన ఊహే అయినా, స్పష్టంగా తెలుస్తోంది. ఆమె కేవలం దూరాన్నుంచి చూచి ఆనందించాల్సిన వస్తువు—మ్యూజియంలో ఉండాల్సిన వస్తువు మ్యూజియంలోనే వుండాలి. అప్పుడే వాటికి ఆ అపురూపమైన విలువ వుంటుంది. ఇంటికి తెచ్చి ఎంత దేవతనైనా ప్రతిష్ఠించుకొంటే, ఆగౌరవమూపోతోంది. ఆ ప్రత్యేకతా పోతుంది.

—మనోహర్ మరో అరగంట అక్కడే గడిపి తిరిగి వస్తోంటే అంది వినీలరేఖ—"వీలున్నప్పుడల్లా వస్తూవుండండి. నేను రోజు సాయంత్రం ఎక్కడికీ వెళ్ళను. ఇంట్లోనే వుంటాను!"

అది చాలా అపూర్వకరమైన ఆహ్వానంలా తోచినా, మనోహర్ దాన్ని మనస్ఫూర్తిగా అంగీకరించలేకపోయాడు. నవ్వుతూ పైకి సరే అన్నా, అంతరాంతరాల్లో మాత్రం ఆమె ఇంటికి ఇక రాకూడదని నిర్ణయించుకొన్నాడు మనోహర్.

# 3

సినిమా వదలటానికి ఇంకా అరగంట పైగావుంది. కానీ అప్పటికే ఆ టాకీసు ముందున్న స్థలం అంతా ఏదో తీర్థం జరుగుతున్నట్లుగా పెద్ద కోలాహలంగా వుంది. ఇసుకవేస్తే రాలనంత జనం.

మనోహర్‌కు పండుగ చేసుకొంటున్నంత ఆనందంగా వుంది. దానికి రెండు కారణాలు—తన కోరిక తీరటానికి ఇది మంచి సమయం. పదిమందీ నిండైన పర్సులతో ఉండటం నిజమే అయినా, ఈరోజు మనోహర్ మాత్రం నిలువు దోపిడీకి సిద్ధపడి లేడు. కళ్ళు కప్పి చేసే మోసం ఈరోజు అతను చేసే ఊహలో లేదు. వ్యక్తిగతంగా ఒప్పుకొన్న తర్వాతే, వాళ్ళు దోచుకోబడటానికి ఒప్పుకొన్నాకే. దోపిడీ!

మనోహర్‌కి నవ్వొచ్చింది-దోపిడీయేగానీ, ఇలాటి దోపిడీకి కూడా ఎంత పోటీయో! ఓ టిక్కెట్టు వుంది అంటే బ్లాక్‌లో దాన్ని కొనడానికి ఒక్కోసారి పదిమంది రెడీ!!

—ఇక రెండో కారణం, ఆ సినిమా తన అభిమాన నటుడిది! అయిదు నెలలక్రితం కారు ప్రమాదంలో దారుణంగా చిక్కుకుపోయి, ప్రాణాలు పోయినట్టే అని అనుకొన్న హీరో, నిజజీవితంలో నిజంగానే మృత్యువుతో పోరాడి మరీ గెలిచాడు. ఆ గెలుపు తర్వాత, ఇదుగో, మళ్ళీ ఇదే సినిమా! చచ్చి బతికిన మనిషి—హీరో అయిన సినిమా!

తన దగ్గరున్న టిక్కెట్లు అన్నిటినీ ఓసారి లెక్కపెట్టుకొన్నాడు—ఇరవైరెండు! — ఫర్వాలేదు, ఈరోజు ఓ యాభై రూపాయలు తన వాటాగా మిగిలే తీరుతుంది!!

—చేస్తున్నది మోసం, అయినా దానికీ ఎంత నీతి!—దొంగల్లో కూడా ఓ నీతి ఉంటుందంటారు. నిజమే కాబోలు!—తను అమ్మబోయే టిక్కెట్టులో రాబోయే లాభంలో టాకీసు మేనేజర్‌కు వాటా. టికెట్స్ బుకింగ్ క్లర్క్‌కు వాటా, ఆ రోజు డ్యూటీలో వున్న పోలీసుకు వాటా—ఇక మిగిలింది తనకు!

అయినా పర్వాలేదు—వ్యాపారం లాభసాటిగానే ఉంటుంది.

పైగా పెట్టుబడికి నష్టం వచ్చే అవకాశంలేని వ్యాపారం!

మనోహర్ ఓసారి వాచీకేసి చూసుకొన్నాడు-అయిదూయాభై అయిదయింది. ఇంకో పదినిమిషాల్లో సినిమా అయిపోతుంది. మాట్నీ అయిపోగానే-తను ఇంక రంగ ప్రవేశం చేయాల్సి వుంటుంది. ఓ అరగంట!-ఆ తర్వాత ఓ రెండు గంటలు రెస్టు—

ఓ వారం రోజులు ఇలా అవస్థపడితే, ఓ మూడు నాలు గొందల వరకూ నిలవ వేసుకోవచ్చు—అవి కాని కాలంలో తప్పని ఖర్చులకు!!

మనోహర్ టాకీసులోంచి బయటకొచ్చి, పక్కనేవున్న ఇరానీ హోటల్లో ఓ టీ తాగాడు, టీ తాగేసరికి అతనికి మరింత ఉత్సాహం వచ్చినట్లుగా అనిపించింది.

సినిమా వదిలేశారు.

—సినిమాలో బాధ భరించలేక బయటివచ్చినవారి ముఖాలన్నీ వికసించే వున్నాయి. సినిమా నచ్చినవాళ్ళ ముఖాలూ వికసించే ఉన్నాయి—మొత్తంమీద మంచి బిజినెసే సాగేటట్లుగా వుందని నిర్ణయించుకొన్నాడు మనోహర్—అనుకోవటం తడవుగా అతని దగ్గర వున్న టిక్కెట్లన్నిటినీ చేత్తో పట్టుకునుంచున్నాడు కౌంటర్‌కు ఎదురుగా.

బిల బిలా అంటూ జనం అతన్ని చుట్టు ముట్టారు.

—మనోహర్‌కు నవ్వొచ్చింది—పిచ్చిజనం! ఏముంటుందని ఈ సినిమాల్లో? ఓ రెండు ప్రేమ దృశ్యాలు, రెండు కామ దృశ్యాలు, ఓ రెండు డాన్సులు, ఓ రెండు డాన్సుల్లాంటి ఫైట్స్-ప్రతి మాటకు మరో అర్థం!—ఈమాత్రం దానికి ఇంత పిచ్చి!—ఇరవై రెండు టిక్కెట్లూ ఒకసారి మళ్ళీ లెక్కపెట్టి, వాటిల్లో ఓ టిక్కెట్టు తన కోసం తీసి జేబులో పెట్టుకొని, దోపిడీ మొదలు పెట్టాడు.

పదిహేను టిక్కెట్లు అయిపోయాయి. మిగతావికూడా అయి పోయే తీరతాయి. ఎటొచ్చీ ఓ పదినిమిషాలు పట్టొచ్చు!

—మనోహర్ అటూ ఇటూ చూస్తోంటే ఓ పక్కగా నిల బడ్డ విసీలరేఖ కనపడింది—మనసొకసారి ఎగిరి గంతేసినట్లయింది.

వెళ్లాలా వద్దా అని క్షణం ఆలోచించి, తన దగ్గరవున్న ఆ టిక్కెట్లూ అమ్మేక వెడదాం అనుకొన్నాడు మనోహర్.

ఈలోగానే ఆవిడ దగ్గర కెవరో వెళ్ళటం, వాళ్ళు ఇద్దరూ టాకీసులోకి వెళ్ళటం చూశాడు మనోహర్.

తన దగ్గరవున్న టిక్కెట్లన్నీ అమ్మి, బుకింగ్ క్లర్క్‌కు చెప్పి, టాకీసు లోపలికి వచ్చాడు. లోపల ఎవరో రాజకీయనాయకుడు ఏదో విషయంమీద మాట్లాడుతూ కనబడ్డాడు తెరమీద! బొమ్మ ఎంత మిథ్యో, ఆ వుపన్యాసానికి ప్రయోజనమూ అంతే!

నవ్వుకొంటూ, కళ్ళు చీకట్లకు అలవాటు పడ్డాక అటూ ఇటూ చూశాడు—దూరంగా కూర్చున్న పినీలరేఖ కనపడింది అతనికి. అటుకేపే నడిచి, ఆమె పక్కనే కూర్చుంటూ అన్నాడు మనోహర్—"నమస్కారం. నేను మనోహర్‌ని!"

ఆవిడా ఆశ్చర్యపోయినట్లుగా పక్కకు తిరిగింది—"మీరా? పలకరిస్తోంటే ఎవరా అనుకొన్నాను."

"ఏమిటి ఈ వేళ ఇలా వచ్చారు?"

"మా స్నేహితురాలు బలవంతంచేస్తే, తప్పించుకోలేక పోయాను—ఇదుగో, ఈవిడ వారిజ అని నా స్నేహితురాలు! ఇతను మనోహర్ అని నా ఫ్రెండే!" అంది పినీలరేఖ ఒకళ్ళను ఒకళ్ళకు పరిచయంచేస్తూ.

"నమస్కారం" అంటూ నమస్కారం చేశాడు మనోహర్. ప్రతి నమస్కారం చేస్తున్న ఆవిడను ఎక్కడో చూపినట్లుగా అనిపించింది అతనికి—ఎంత ఆలోచించినా గుర్తురాలేదు. "ఈ సిటీలో ప్రతివాళ్ళనూ ఎక్కడో ఓచోట చూసినట్లే వుంటుంది" అని అనుకొని ఊర్కొండిపోయాడు.

"చెప్పండి, ఈమధ్య మా ఇంటికి రానేలేదేం?"

క్షణం ఆగి అన్నాడు మనోహర్—"ప్రత్యేకమైన కారణం అంటూ ఏమీలేదు. రావాలనుకొంటూనే ఏదో నిర్లక్ష్యం...."

"మీ గుడ్డ వ్యాపారం జోరుగా వుందేమోననుకొన్నాను!"

—మనోహర్‌కు నవ్వొచ్చింది-తన గుడ్డ వ్యాపారం!—

ఎవరి కష్టమో పెట్టే గుడ్లు, తన జేబులో పొదగబడుతున్నాయి!!

సినిమా ప్రారంభమవుతోంటే అంది—"రండి, మా ఇంటికి —మీరొస్తారని చూస్తూనే వున్నాను!"

మనోహర్ ఏమీ అనలేదు.

ఇంటర్వెల్ అయిన వెంటనే 'ఏదైనా డ్రింక్స్ తెస్తా'నంటూ మనోహర్ బయటకు వెళ్ళగానే, ఉన్నట్లుండి అంది వారిజ-"అతను నీకు స్నేహితుడా?"

"అవును. ఏం?"

"ఎలాటి స్నేహితుడు?" మళ్ళీ అడిగింది వారిజ.

"ఎలాటి స్నేహితుడేమిటి నీముఖం! కేవలం స్నేహితుడు-అంతే?"

"మంచి స్నేహితుడే అయితే! మనం సినిమా చూస్తున్నామంటే అది అతని భిక్షే!"

"అంటే?—"

"నేను టిక్కట్లు అతని దగ్గరే బ్లాక్‌లో కొన్నాను!" అంది వారిజ.

వినీలరేఖ మ్రాన్పడిపోయింది—"నిజం?"

"నాకు అతను శత్రువుకాడు!" అంది వారిజ. వినీలరేఖ ఏదో అనబోతోంటే కళ్ళతో సైగచేసి ఆపుతూ అంది — "వస్తున్నాడు!"

వినీలరేఖ అటుకేసి చూసింది — పాసేజ్‌లో వస్తున్న మనోహర్‌కేసి పరీక్షగా చూసింది. మనోహర్‌ను చూస్తోంటే టికెట్స్ బ్లాక్‌లో అమ్మేవాడిగా కనపడలేదు.

—మనోహర్ తెచ్చిన డ్రింక్స్ మౌనంగా అందుకొన్నారు ఇద్దరూ.

—సినిమా అయిపోయి బయటకొచ్చాక మనోహర్ వాళ్ళను రిక్షా ఎక్కించి సెలవు తీసుకొంటూంటే అంది వినీలరేఖ—"రేపు ఆదివారం తప్పకుండా రండి—మీకోసం చూస్తుంటాను!"

"ఆదివారమా?...." మనోహర్ క్షణం ఆలోచించి అన్నాడు

—"సరేనండి, పన్నెండు. పన్నెండున్నరకు వస్తా!"

రిక్షా కదిలింది.

"మార్నింగ్‌షో వ్యాపారం అయిపోయాక వస్తాడు కాబోలే!" అంది వారిజ.

వినీలరేఖ ఏమీ అనలేకపోయింది—వారిజ అన్నది, అంటున్నదీ తప్పే అయివుంటుంది. వారిజే ఎక్కడో పొరబాటు పడి వుంటుంది అని అనుకొంది మనసులో.

—వినీలరేఖలో ఆరోజు సినిమా చూసిన ఆనందం అంతా చప్పగా చల్లారిపోయింది.

## 4

ఆదివారం ఎప్పుడొస్తుందానని కళ్ళల్లో ఒత్తులు వేసుకొని వేచి చూచింది వినీలరేఖ. ఆదివారం వస్తే, మనోహర్ తన్ను కలుసుకోవటానికి వస్తే....వస్తే ఏంచేయాలో, అసలేదైనా ఎందుకు చేయాలో తోచలేదు. అయినా ఆదివారంకోసం వేచి చూచింది.

రోజూ తెల్లవారగన్లే నిద్రలేచే సూర్యుడు ఆరోజు మాత్రం ఆలస్యంగా నిద్రలేచాడా అనిపించింది ఆమెకు. రోజూ తన్ను తన కొక్కొరొకోలతో నిద్రలేపే ఆ పక్కింటి కోడి ఆరోజు అసలు తనే నిద్రపోలేదేమో ననిపించింది ఆమెకు.

ఎనిమిది, తొమ్మిది, పది....ఎప్పటికయ్యేను పన్నెండు, పన్నెండున్నర? ఎప్పటికి వచ్చేను మనోహర్??

—మనోహర్ గురించి ఆలోచించినపుడు వినీలరేఖ మనసొకసారి తన్ను తాను తడిమి చూసుకొంటోంది. ఆ సంగతి ఆమెకు స్పష్టంగా తెలుస్తోంది.

ఏమిటంత ఆసక్తి తనకు? తనకు అతనికీ పరిచయం కొన్ని రోజుల వయస్సుది. అందులోనూ కేవలం కొన్ని గంటలు మాత్రం తను అతనితో ఆత్మీయంగా పంచుకుంది. అంతమాత్రానికే....ఇలా ....అతను తప్పుచేస్తున్నాడని వినగానే తన మనసు రెపరెపలాడటం, ఏదో బాధ అనుభవించటం....తమాషాగానే వుంది కానీ అది అబద్ధం మాత్రం కాదు.

రైల్లో టిక్కట్టు పోగొట్టుకొన్న వ్యక్తికి తను, స్వతహాగా సాయంచేస్తే, అది ఇలా తన్ను ఆత్మీయతతో పెనవేసుకోవటం అర్థం కాకుండానే వుంది. అయినా ఆ టిక్కట్టు పోవటం కూడా అబద్ధమే ఏమో!—వినీలరేఖ ఒకసారి అలా అనుకొన్నాగానీ, మళ్ళీ ఇంకోసారి అలా అనుకోవటానికి ఆమె మనసు అంగీకరించలేదు.

—మనోహర్ వస్తే....వస్తే ఏంచేయాలి? అనేది తెలీకపోయినా, అతనికోసం వేచి చూస్తూ వుండిపోయింది.

గంట అంటే ఇంతసేపని, ఆ నిరీక్షణలో ఇంత నరకం వుందని ఆమె ఎపుడూ అనుకోలేదు. కానీ, మనసుకోరుకొన్నపుడు కాలం పరిగెట్టి, వద్దనుకొన్నపుడు కాలం ఆగిపోతే ఎంత బాగుండును!

—వినీలరేఖ ఆలోచనలన్నీ ఇలా అస్తవ్యస్తంగా వున్నపుడు తలుపు తట్టిన చప్పుడయింది. వెళ్ళి తలుపుతీస్తూ అంది—"రండి, మీకోసమే చూస్తున్నాను."

మనోహర్ నవ్వుతూ అన్నాడు—"ఆదివారం, పన్నెండు. పన్నెండున్నర కొస్తానన్నాను. వచ్చాను."

"థాంక్స్—" అంది వినీలరేఖ లోపలికి నడుస్తూ.

ఫ్లాస్కులో వున్న టీ కప్పులోకి పోసిస్తూ అంది—"ముందు టీ తీసుకోండి. ఓ అరగంట తర్వాత భోజనం చేద్దాం."

మనోహర్ నవ్వుతూ అన్నాడు—"నేను టీ తాగుతానన్నది బాగా గుర్తుపెట్టుకొన్నారే!....అలాగే కానీండి!"

టీ సిప్ చేస్తోంటే అంది వినీలరేఖ—"మీరేమీ అనుకోనంటే కొన్ని అడుగుతా మరి."

"అడగండి."

"అవి మీ పర్సనల్ విషయాలైతే...."

"అయినా అడగండి. పర్వాలేదు. ఎంత పర్సనల్ విషయాలైనాసరే. కొన్ని కొంతమందికి తెలియటం మంచిది."

"నాకు తెలిసినంత మాత్రాన మీకు నష్టం కలిగితే?—"

"కలగదని నాకు బాగా తెలుసు!"

"ఏం?"

"ఎందుకంటే....మంచివాళ్ళకు ఆలోచనల్లో సైతం మంచే వుంటుంది. నేనేమైనా చెడుపని చేసివున్నా, మీ మంచితనంవల్ల, అందులోనూ మంచే చూస్తారేమో!—"

"నేను మంచిదాన్నని మీకు నమ్మకంలా వుంది!....కొంత మందిలోని చెడు కనపడకుండా దాక్కునే వుంటుంది!"

"మీలో చెడు సంగతి నాకు చెప్పకండి....అయినా ప్రశ్న వేస్తానన్నది మీరు."

ఆగిపోయింది వినీలరేఖ. అడగాలనుకొనేది మనసులో మననం చేసుకొని కూడా. ఎలా అడగటం?

"అడగండి."

"మొన్న నేనొకటి విన్నాను—-అది నిజమా కాదా అని!"

మనోహర్ వులికి పడ్డాడు—ఏమంటోంది ఆవిడ? ఆవిడ విన్నది ఏమయి వుంటుంది? ఆ విన్నదేదో తన పర్సనల్ విషయం అని ముందే చెబుతోంది. అంటే....?

"ఏ సంగతో చెప్పండి."

"మొన్న సినిమా హాల్లో మీరు టిక్కట్లు బ్లాక్‌లో అమ్మారట గదా?"

మనోహర్ మనసొకసారి వులికిపడింది—ఛ, ఎలాటి సంగతి తెలిసిపోయింది ఆవిడకు! అబద్ధం చెప్పటం అనవసరం. నిజం చెబితే ఏమీ నష్టం వుండదు తనకు—మహా అయితే ఈవిడకూ తనకూ ఈ రోజుతో రాం, రాం. అంతే! కానీ....

"మా ఫ్రెండొకడు వస్తానంటే టిక్కెట్లు కొన్నాను. అతను రాకపోయేసరికి...."

వినీలరేఖ అతన్ని ఆపుతూ అంది—"అబద్ధం చెప్పటం రానప్పుడు అబద్ధం చెప్పనేకూడదు. మీ దగ్గర ఎన్నో టిక్కెట్లు వున్నట్లు వారిజ చెప్పింది. పైగా మేము సినిమా చూశామంటే, ఆ టిక్కట్లు మీ దగ్గర వారిజే బ్లాక్‌లో కొన్నవి."

"అవును—యిప్పుడు గుర్తొస్తోంది. ఆవిడకు నేనే ఇచ్చాను"

"ఇచ్చాను కాదు, అమ్మాను అనండి."

మనోహర్ ఏమీ అనిలేదు.

—"పోనీ ఇంకోటి చెప్పండి. ఈసారైనా నా కోసం నిజం చెప్పండి. మొన్న ట్రైన్‌లో టిక్కెట్టు పోవటం ఎంత వరకూ నిజం?"

మనోహర్ ఆవిడకేసి ఒకసారి చూశాడు. ఆవిడ తనకేసి పరీక్షగా చూస్తోంది. ఆవిడ ముందు చూస్తూ చూస్తూ తనో అబద్ధం ఆడగలగటం కల్ల అన్నది అతనికి స్పష్టంగా తెలుస్తూనేవుంది.

—ఎందుకిలా ఓడిపోతున్నాడు తను?

ఏముంది ఆవిడలో ఆశక్తి??

"—నిజం కాదు—అదీ అబద్ధమే!" అంటూ నిజం చెప్పాడు మనోహర్.

—వినీలరేఖ ఏమీ అనలేదు. ఆవిడ బహుశా ఇది ముందే ఊహించింది కాబోలు. ఆవిడలో పెద్ద మార్పేమీ కలిగినట్లుగా మనోహర్‌కు తోచలేదు. కానీ అంతరాంతరాల్లో, మనసుపొరల్లో జరుగుతున్న ఆ పోరాటాన్ని అపుకోటానికి ఆవిడ పడుతున్న ఆ బాధ ఆవిడొక్కరికే తెలుసు.

చాలాసేపు నిశ్శబ్దం తర్వాత నెమ్మదిగా అంది వినీలరేఖ— "చదువుకొన్న వాళ్ళం, మనం ఇలా చేస్తే ఎలా అని ఒక్కసారైనా ఆలోచించారా?"

ఆ ప్రశ్న మనోహర్ గుండెల్లోకి సూటిగా తగిలింది. ఎన్నాళ్ళనుంచో గుండెల్లోనే అదుముకొన్న బాధ ఒక్కసారి పెల్లుబికి వచ్చింది. తన్ను తాను సంబాళించుకొంటూ అన్నాడు—"చదువుకొన్న వాళ్ళం అని నన్నూ అందులో చేర్చకండి."

"అంటే?...."

"నా చదువు ఏడో తరగతితో ఆగిపోయింది."

"అదేం?"

"దానికి ఎన్నో కారణాలు—ఏవని చెప్పను?" అని క్షణం

ఆగి అన్నాడు మనోహర్—"కొన్ని సినిమాల్లో చూస్తుంటాం మనం, పరిస్థితులవల్లే అలా జరుగుతూ ఉంటుంది అని!—నిజం, పరిస్థితులే మనిషిని ఎలాగైనా మార్చేస్తాయని అనుకోవడానికి నా జీవితమే ఓ మంచి ఉదాహరణ. నాన్న ఉన్నంతకాలం గారాబు బిడ్డగా పెరిగిననేను, మానాన్న పోయేసరికి దిక్కు లేనివాణ్ణి అయి పోయాను. హెడ్‌మాస్టరు గారు పిలిచి చెప్పారు, పరీక్షలు ఇంకో పది రోజుల్లోనే గదా, నా ఇంట్లోనేవుండు అని, అలానే వాళ్ళ ఇంట్లోనే వుండిపోయి పరీక్షలు అయ్యాయనిపించాను. నాన్న చేసిన గారం నన్ను నాశనం చేసింది. పరీక్షలుపోయాయి. పరీక్ష పాసయితే, వారాలు ఏర్పాటు చేయిస్తానన్న హెడ్‌మాస్టర్ గారు నా పరీక్ష పోవ టంతో పూర్కొండిపోయారు—నా కష్టాలు అప్పటినుంచీ మొదలు. తెగిన గాలిపటంలా ఎటువైపు వెడుతున్నానో తెలీని స్థితి. గాలి వాటు ఎటుంటే అటు వెళ్ళటం జరిగింది. హోటల్లో సర్వర్‌గా, బస్సుస్టాండులో క్లీనర్‌గా, ఓ సోడా కొట్టులో సోడాలు తయారు చేయటంలో....ఇలా ఎన్నోరకాల వేషాలు వేశాను. కానీ కడుపు నిండా ఏదీ దొరికేది కాదు. వాళ్ళిచ్చేది సరిపోయేదికాదు. అందుకే నెమ్మదిగా వాళ్ళు ఇవ్వని దాన్ని నేనే అందుకొనే వాణ్ని. ఓ ఉద్యోగం పోతే, మరొకటి—అనేధ్యాసలో ఉన్నానేగానీ, అన్నిటికీ నీతి ముఖ్యం అనేసంగతి తెలిసేసరికి, నాకు ఎవరూ ఉద్యోగం ఇవ్వని స్థితి వచ్చేసింది. నెమ్మదిగా జేబులు కొట్టటం, పిక్‌పాకెటింగ్ అన్నీ అలవాటయి, నన్ను ఈ స్థితికి తెచ్చాయి—ఈ రోజున అవి చేయలేని స్థితిలోకి నేను పోగలగటం అనేది బహుశా అసంభవం ఏమో అనిపిస్తుంటుంది నాకు."

—మనోహర్ ఆగాడు. ఆ ఆగటం గుక్క తిప్పుకోవ టానికి కాక, గతంలో జీవితంలోని సంఘర్షణ గుర్తు కొచ్చినట్లుగా, ఆ జ్ఞాపకాన్ని సైతం భరించలేనన్నట్లుగా ఆగాడు.

"....ఇంత జరుగుతున్నా, జీవితంలో ఇలా ఓడిపోతున్నా నని తెలిసీ, చదువు అంటే వుండే కోరిక చంపుకోలేక పోయాను. చదువుకోవటం అన్నది ఆగిపోయాక కానీ దాని విలువ తెలీలేదు.

అందుకోవాలని ఆ తర్వాత ఎంత ప్రయత్నించినా వీలుకాలేదు. ఎందరినో అడిగాను. కొంచెం సహాయం చెయ్యమని—ఏడవ తరగతి పైలయిన నన్ను చూస్తే వాళ్ళకు నమ్మకం కలగనేలేదు—ఎన్నో ఆఫీసుల్లోకి వెళ్ళాను. చదువుకొన్న వాళ్ళంతా టేబిళ్ళముందు కూర్చుని, ఫానులకింద పని చేస్తోంటే, చెయిజాచి నాకు విద్యాభిక్ష పెట్టమని అడిగాను. వాళ్ళు లేదనేవారు. కక్ష రోజురోజుకీ పెరిగేది. అందుకే మొదటి తారీఖున కనీసం పది జేబులైనా కత్తిరించేవాణ్ని. ....కానీ, ఆ డబ్బుతో నాకు చదువు అబ్బిరాదన్నది తెలుసు. ఒకడి కడుపుకొట్టి, కొంచెం కడుపునింపుకో గలిగేవాణ్నేకానీ, అలా కొట్టేసిన డబ్బు మాత్రం ఏమైపోయేదో అంతే తెలిసేది కాదు. అందుకే-ఆఖరికి ఇలా—చదువుకోక పోయినా, చదువుకున్నవాడిలాగ నటించటంలో ప్రావీణ్యం సంపాదించి, ఇలా తృప్తి పడుతున్నాను—"

—మనోహర్ చెప్పటం ఆపాడు. ఎన్నో ఏండ్ల బాధ కొన్ని మాటల్లోకి మార్చుకొని, అవి వెళ్ళగక్కి కొంచెం శాంతించాడు. ఎవరితోనో ఒకరితో పంచుకోవాలనుకొన్న అతనికోరిక, ఈ రోజుకు ఇలా తీరింది.

మనోహర్ చెప్పటం అంతా వింటోంటే వినీలరేఖకు అదంతా కథలా తోచింది. కానీ అది నమ్మింది. మనిషి ఎవరైనా-మనసు విప్పి చెప్పుకొనే క్షణాలలో నిజమే చెప్పటం జరుగుతుంది. అంత క్రితం ఎన్ని అబద్ధాలాడినా, ఆక్షణం అలాటిది—అందుకే వినీలరేఖ, మనోహర్ చెప్పింది నమ్మింది. అయినా ఒక్కసారి ఆమె మనసులో అనుమానం అనే తెర ఊగిసలాడింది. అందుకే అడిగింది—"చెప్పింది నిజమేనంటారా?"

మనోహర్ దెబ్బతిన్న సంగతి స్పష్టంగా వినీలరేఖకు తెలిసింది. అందుకే మళ్ళీ అంది—"నిజం చెబుతున్నారనే నమ్మకం కలిగినా అడుగుతున్నా—నా నమ్మకం నిజమేననండి, చాలు!"

మనోహర్ తలపైకి ఎత్తి చూశాడు. అతని కంటి కొలకుల నిండా నీళ్ళు నిండుకొన్నాయి. ఆ నీళ్ళు కిందకు జారటానికి ప్రయత్నిస్తోంటే, అతను అతి ప్రయత్నం మీద ఆపుకొంటూఅన్నాడు—

"నిజం చెప్పాను అని చెప్పటం, బహుశా నిజానికే అవమానం!"

వినీలరేఖకు అతనంటే అపారమైన గౌరవం కలిగింది— తప్పుచేశాడు. అయితే నేం, తప్పుచేశాను అని ధైర్యంగా చెప్పుకో గలిగిన ధైర్యంవుంది అతనిలో—తప్పు ఒప్పుకోవటం కన్నా మనిషి మారటానికి నిదర్శనం మాత్రం ఏముంది గనుక?

—కొంతసేపు కొండంత నిశ్శబ్దం. ఇద్దరిమధ్య ఎన్నెన్నో మాటలు పలుకరించుకోకుండానే వెళ్ళిపోతున్నాయి.

కొంత సేపటికి వున్నట్లుండి అంది వినీలరేఖ—"పోనీండి. జరిగినదాన్ని గురించి ఆలోచిస్తూ గడపటం తెలివి తక్కువేమో!"

"నాకు జరగబోయేది మాత్రం ఏముంటుంది గనుక?—నా భవిష్యత్తు ఏమిటో నాకు స్పష్టంగా తెలుస్తూనే వుంది. ఇలాగే ఈ చీకటి జీవితం గడుపుతూనే ఏరోజో చట్టం చేతిలో చిక్కటం జరిగాక, ఆరోజునుంచి జైల్లో వెలుగు చూడగలుగుతాను. కానీ.... పోనీండి, జీవితం జైల్లోనే గడిచే రాతవుంటే బహుశా అలాగే జరుగుతుంది!"

వినీలరేఖ నొచ్చుకుంటూ అంది—"అలా ఎందుకు అనుకో వటం? చేతనైతే మంచి మార్గాన పడే ప్రయత్నం చెయ్యచ్చు గదా!"

"మంచికీ నాకూ బోలెడు దూరం!" అన్నాడు మనోహర్ చిన్నగా నవ్వుతూ. ఆ నవ్వులో జీవం అనేది ఎక్కడాలేదు.

"అవి మీ రనుకుంటున్నారేమో గానీ—మీలోవున్న మంచి తనం ఏమిటో మీకు తెలీదు. అవకాశం అనేదీ వస్తే, మీ అంత మంచివారు మరొకరు వుండరేమో అనిపిస్తుంది."

"అవకాశం అనేది రాదని నాకూ తెలుసు. నా జీవితంలో మంచి మార్గాలన్నీ ఎపుడో మూసుకుపోయాయన్నదీ తెలుసు."

—మనోహర్ అలా మనసు విప్పి చెప్పటం వినీలరేఖకు సంతోషంగానే వుంది. కానీ అతను విప్పి చెప్పినసంగతులు మాత్రం ఆమెకు బాధ కలుగజేస్తున్నాయి.

"అలా అనుకోకండి. అవకాశం అనేదివస్తే, ఉపయోగించు

కోవటానికి మీరు సిద్ధమా అన్నది ఆలోచించి సిద్ధంకండి."

"అంటే...."

వినీలరేఖ నెమ్మదిగా అంది—"చూడండి. కారణాలు అడగకండి—మీ ఆగిపోయిన చదువు ఆగిపోకుండా వుండటానికి నేనో సాయంచేస్తాను. చదువుకోవాలనీ, మంచి మార్గాన పడాలనీ ధ్యాస మీకు వుంటే, నా సాయాన్ని అంగీకరించండి."

"అంటే....అయినా మీ కెందుకు శ్రమ?"

"శ్రమ ఏముంది! ఇది నా కోరిక ఏమో మీకు తెలుసా? రైల్లో టిక్కట్టు పోయింది అని చెప్పినరోజున చిన్న సాయం నా అంతట నేనే చేశాను. జీవితంలో అవకాశం పోగొట్టుకున్న మీకు, ఆ అవకాశాన్ని నేను కలిగిస్తాను — అదీనాకు అవకాశం వుంది గనుక!...."

మనోహర్ ఆశ్చర్యపోయాడు—ఏమంటోంది ఈవిడ? తన్ను చదివిస్తాననా? చదివించి....ఏం చేస్తుంది? చదవటం అంతా అయిదూ పదులలో తేలేది కాదు.

"మీరు తొందరపడి నిర్ణయించుకొంటున్నారు—చదవటం అంటే ఇపుడు చాలా ఖరీదు అయిన పని అయిపోయింది. రైల్లో టిక్కట్టుకు అయిదు, చేతిఖర్చుకు పదీ ఇచ్చినట్లు కాదు."

"ఫర్వాలేదు."

"తీరా జేసి నాకు చదువు రాకపోతే?—"

"చదువు అనేది బ్రహ్మవిద్యకాదు. ఆసక్తివుంటే అదే వస్తుంది. మీకా ఆసక్తివుంది. నాకు తెలుసు."

నవ్వుతూ అన్నాడు మనోహర్—"సరే. అయితే! చదువంతా అయ్యాక ఆ డబ్బు తిరిగి ఇవ్వకపోతే?...."

వినీలరేఖ క్షణం ఆగి అంది—"మీరు తిరిగి యిస్తారనేది నాకు బాగా తెలుసు! అయినా తిరిగి ఇచ్చేస్తే లోన్‌స్కాలర్‌షిప్, తిరిగి ఇవ్వకపోతే మెరిట్ స్కాలరుషిప్ అనుకోండి."

మనోహర్ పక్కున నవ్వాడు—"నాలో మెరిట్ అంటూ ఉందని గ్రహించిన వారు ఇప్పటికి మీరొక్కరే అయ్యారు."

"ఇకముందు చాలామంది వుంటారేమోలెండి!—కానీ నేను చేసే సాయానికి ఓ షరతు కూడా వుంది."

"అదేమిటి మళ్ళీ?"

"చేసేపని ఏదైనా మనస్ఫూర్తిగా చెయ్యాలి. చదువుకోవటం అనేది ఎలావున్నా. చెడు వేషాలు మాత్రం మానెయ్యాలి. అలా చేస్తానని మాట ఇవ్వండి."

మనోహర్ క్షణం తటపటాయించి అన్నాడు—"నా మీద మీకు కలిగిన నమ్మకం అపారమైనది. ఈ నమ్మకం కూడా వుంచుకోండి—ఇక తెలిసి తెలిసీ ఏ తప్పు చెయ్యను! సరేనా?"

—వినీలరేఖకు ఎంతో సంతోషంగా వుంది. మనోహర్‌కు ఇబ్బందే అయినా మంచి మార్గంలోకి వెళ్ళే ప్రయత్నం చేస్తానని అన్నాడు. అది చాలు అనుకొంది వినీలరేఖ.

—మరో అరగంట తర్వాత మనోహర్ మలుపు తిరిగి వెళ్ళిపోతోంటే. వినీలరేఖ కళ్ళు. అతని వెనకినుంచి ఆనందంగా తడిమి చూశాయి.

## 5

—ఇంట్లోకి వచ్చాక వినీలరేఖకు తననెంతో ఒంటరితనం చుట్టుముట్టినట్లుగా తోచింది. ఇంతసేపూ మనోహర్ వుండటంతో. ఏదో తెలీని అనిర్వచనీయమైన అనుభూతి కలగటం. ఈ క్షణంలో ఇలా ఒంటరితనం తన్ను అన్ని పక్కల నుంచీ ఆవరించుకోవటం వినీలరేఖకు తమాషాగానూ. వింతగానూ. అనిపించినా. మనసంతా హాయిగా మాత్రం వుంది.

మనోహర్....ఏమో. జీవితం ఏం మలుపు తిరగబోతోందో తెలీదు. కానీ ఏదో తెలీని కోరిక ఒకటి తన్ను బలవంతం చేసి. అతనంటే ఉండే ఆకర్షణకు లొంగేటట్లుగా చేసి. అతన్ని ఓ మంచి మనిషిగా మలుచుకోవాలనే తపన కలిగించింది. అందుకే—జేబుదొంగగా. బ్లాక్‌మార్కెట్ చేసే వ్యక్తి అయినా అవకాశం వస్తే మంచి మార్గంలోపడే తీరతాడనే తన నమ్మకం అతని మీది ప్రయోగించి చూస్తోంది.

అంతేనా?—

కేవలం తన నమ్మకం ఋజువుచేసుకోవడానికే తప్ప ఇంకే కోరికా లేదా?

లేదు అనుకోవటం ఆత్మవంచన.

గతాన్ని ఒకసారి స్మరిస్తే, జీవితాన్ని ఒకసారి తడిమి చూసుకొంటే—తెలుస్తూనే ఉంది. తనకోరిక అదొక్కటేకాదని!

తను, నాన్న పోయాక మేనమామవద్ద రెండేళ్ళు చదవటంతో మెట్రిక్ పూర్తిచేసుకోగలిగింది. ఇంకా చదవాలనే కాంక్ష మనసులో రెపరెప లాడుతున్నా, కొంచెం పరిస్థితులు అర్థంచేసుకోగలిగే అవసరమూ, వయసూ రావటంతో ఆ కోరికకు సమాధి కట్టలేక, ఊర్కోలేకనూ పోయింది—మేనమామ కుటుంబం పరిస్థితి తనకు తెలియనిది కాదు—ఇంట్లో అందరూ చిన్న చిన్న పిల్లలు. ఏ ఎనిమిదేళ్ళకో తొమ్మిదేళ్ళకో కానీ ఏ ఒక్కడో రెక్కలు తెచ్చుకోగలిగేస్థితి వచ్చేదికాదు. అందుకే తన కోరికకు మేనమామ ఇంట్లో స్థానం వుండదని తెలిసినా—ఒకసారి అదే అడిగింది, ఇంకా చదవాలని వుంది. ఏం చేద్దాం అంటూ.

"పరిస్థితి నీకు తెలీంది కాదు విన్నూ! నువ్వు ఆలోచించుకో—" అన్నాడు. అంతకన్నా ఏమగవాడైనా తన నిస్సహాయస్థితి చెప్పలేడేమో! బాగా ఆలోచించి అంది—"పోనీ చలపతి బాబయ్యను అడుగుతా—ఓ రెండేళ్ళు సాయం చేస్తాడేమోనని!"

మామయ్య నవ్వాడు—"నీ యిష్టం అయినా చలపతి నీకు సాయం జేస్తాడనే నీ ఊహ?"

కాదు. కానీ ఇంకోరాయి విసరటంతో తప్పేముంది అనుకుంటూనే వెళ్ళింది. రెండు రోజుల ఆదరణ తర్వాత నెమ్మదిగా తన కోరికబయట పెట్టింది బాబయ్యముందు. బాబయ్య ఏం చేస్తాడని వచ్చింది?—ఏం చేశాడు??—ఆ సంవత్సరం ప త్తి పంటలో నష్టం గురించి చెప్పాడు. క్రితం సంవత్సరం మిరప పొలాల్లో నష్టం గురించి చెప్పాడు. బజారులో పడిపోతున్న రేట్లగురించి, ఇంట్లో పడిపోయిన జీవన ప్రమాణాన్ని గురించీ పేపర్లలో ఉపన్యాసాల

లాగ చెప్పాడు. ఇవన్నీ చెప్పాడేకానీ—తన ఇంట్లో మూలుగు తున్న డబ్బుగురించి చెప్పలేదు. రెండేళ్ళచదువు అంటే మహా అయితే ఓ రెండువేలు—అన్నయ్య కూతురికోసం ఖర్చు పెట్ట గలిగే స్థోమత, అవకాశంవున్నా పెట్టలేనని దాదాపు స్పష్టంచేశాడు.

మనసువున్నా సాయంలేని మామయ్య.

చెయ్యగలిగినా చేయని బాబయ్య!-ఏమైతేనేం తన చదువుకు ఆటంకం తప్పలేదు.

. ఆగిన చదువు కొనసాగించగలిగే ఓపికా, స్థోమత, అవకాశం ఉద్యోగం రావటంతోనే పోయాయి. నెల నెలా ఇంత అని అతని జీతం రావటంతో, అది తనకు కొంత చేయూతే అయింది. మామయ్య దగ్గరే అమ్మనూ, తమ్ముణ్నీ వదిలేసి, తమ్ముడిని చది విస్తూ—తను ఇక్కడ ఒంటరి జీవితం!

సహాయం పొందలేకపోవటం అంటే వున్న బాధ అర్థం అవటంతో. తనకు చేతనైనంత సాయం చేయాలని నిర్ణయించు కొంది. అదీ చదువు విషయంలో అయితే. మరీ సంతోషంగా!

—జీతం అందుకొన్న రోజున మొదట చేసేపని దగ్గరలోనే వున్న అనాథశరణాలయానికి వెళ్ళటం, ఓ పది రూపాయలు పెట్టి కొన్న బిస్కట్లు, చాక్లెట్లు అక్కడ వాళ్ళకు పంచటం, మరో పది రూపాయలు విరాళం అందించటంగా అలవాటు చేసుకొంది. ఉన్న దాంట్లో మరొకరికి ఇంత పంచటంలో వున్న ఆనందం ఏమిటో అనుభవించటం మొదలు అయ్యాక, ఆ ఆనందానికి మరి దూరం కాదల్చుకోలేదు.

కానీ....పుట్టింది ఆడపుటక. ఎప్పటికో ఇంకోచోట ఎక్కడో జీవితం వెళ్ళబుచ్చాల్సిన బ్రతుకు అన్నది స్పష్టం. మేనమామకానీ, బాబయ్యకానీ తన్ను ఓ ఇంటిదాన్నిగా చూడగలిగే ఓపిక వున్నవారు కాదు. మేనమామకు అవకాశం సున్నా- బాబయ్యకు ఆ కోరిక సున్నా-అందుకే తన జీవితం తను చక్కదిద్దుకోవాలనేది స్పష్టంగా తెలిపిన సంగతి.

# 6

క్రిక్కిరిసిన జనంతో నిండిన ఆ బస్సు మరో భారతదేశంలా వుంది. పాగాలవాళ్ళు. పొగలవాళ్లు. పగలవాళ్ళు. పావడాలవాళ్ళు. జాకెట్లవాళ్లు. జార్జెట్లవాళ్ళు.... అందరూ తలో రకానికి ప్రాధాన్యత వహిస్తున్న నాయకుల్లాగా, నాయకీమణుల్లాగా కనిపిస్తున్నారు.

కండక్టర్‌కు టిక్కెట్లు ట్రే. టిక్కెట్లమీది స్టేజీ నంబర్లు కనిపిస్తున్నాయి.

డ్రైవరుకు ముందుపోతున్న డబుల్‌డెక్కరు బస్సు, వెనుక వస్తున్న మోటారు సైకిలూ—రెండూ సమంగానే కనిపిస్తున్నాయి. వెనుకనుంచి వచ్చే ఆ మోటారు సైకిలును పోనివ్వటమా లేకపోతే తనే ముందుగా ఆ డబుల్‌డెక్కర్‌ను దాటిపోవటమా అన్న సమస్యను ఏవిధంగానూ మార్చుకోలేక, అలైడ్ పవర్స్‌కు లొంగటమా లేక మళ్ళీ పోరాటం ప్రారంభించటమా అన్న సమస్యలో కొట్టుమిట్టాడుతున్న హిట్లర్‌లా పోజుపెట్టి, స్టీరింగ్ పట్టుకొని వున్నాడు.

బస్సులో ముందుపక్క నుంచునివున్న వారి చూపులు పలు రకాలుగా వున్నాయి. రెండోసీటు దగ్గర నిలబడివున్న పెద్దమనిషి బస్సు అద్దంలోంచి చూస్తున్నట్లుగా కిందకూర్చున్న ఆడమనిషి జాకెట్లోంచి ఆమె వంపుల్ని కొలతవేస్తున్నాడు. మూడో సీటులో కూర్చున్న ఆ హైస్కూలు అమ్మాయి ఎదురుగా నిలబడ్డ అబ్బాయి కళ్ళల్లో కళ్ళు కలిపే ప్రయత్నం చేస్తోంది.

—మనోహర్ కళ్ళు మాత్రం ముందు నిల్చున్న గోధుమ రంగు పాంటు జేబుమీద వున్నాయి.

పుట్టలోంచి తల బైటకుపెట్టి ప్రపంచాన్ని తదేకంగా చూస్తున్న నల్లని నాగరాజులా, ఆ పాంటుజేబులోంచి కొంచెంగా పైకి తలెత్తి గర్వంగా తొంగి చూస్తున్న నల్లపర్సు అతనికి కనిపిస్తోంది. పిల్లల్ని పెట్టబోయే బ్లాక్ ఏంజిల్ ఫిష్ కడుపులా నిండిపోయిన ఆ పర్సు చూస్తోంటే మనోహర్ ఆలోచనలు అదోమాదిరిగా అయిపోయాయి.

—బస్సు నడుస్తూనే ఉంది.

మనోహర్‌కు మనసంతా పర్సుమీద వుంది.

కానీ, మనసు పొరల్లోంచి ఎక్కడో వినీలకు ఇచ్చిన ఆ మాట....ఉహూ తప్పు, తను చేస్తున్నది తప్పు అని మనసు హెచ్చరించటమూ కనిపిస్తోంది.

కానీ పర్సు చేస్తున్న ప్రదర్శన, అతన్ని అమితంగా ఆకర్షిస్తోంది. ఎంత తేలికగా ఆ పర్సును తన స్వంతం చేసుకోవచ్చో అనేది మనోహర్‌కి తెలీని సంగతికాదు.

కానీ, వినీల....?

ఉహూ—తను ఈపని చేయలేదు.

తన గత జీవితానికి సమాధి కడతానని తనంతట తానుగా ఇచ్చిన మాటను తప్పటం అనేది తను చేయలేడు. వినీలకోసం కాదు, అది తనకోసం! మంచి మార్గంలోకి అనుకోకుండా మళ్ళటానికి వచ్చిన ఆ అవకాశాన్ని మళ్ళీ తనే జారవిడుచుకోడు. చెడు మార్గంలోకి జారి, ఆ జారుడు మెట్లలోంచి మరిన్ని అగాధాలలోకి పోవటం తను చేయనిపని—అనుకొన్నాడు మనోహర్.

కానీ-పర్సు ఎదురుగా, అందమైన స్త్రీ పక్వమైన యవ్వనంతో పరిపూర్ణమైన వంపులతో ఆహ్వానిస్తున్నట్లుగా వుంది. ఆ ఆహ్వానం తిరస్కరించటం తేలిక అయిన పనికాదు అనుకొన్నాడు మనోహర్.

—తను బుద్ధుడుకాడు, తను మహాత్ముడుకాడు.

కానీ, తను, తన జీవితానికి చరమగీతం పాడుకొనే ఘోరమైన మనిషి మాత్రం కాకూడదనుకొన్నాడు మనోహర్.

—బస్సు ఆగింది.

కిందనున్న జనంలోంచి ఆ బస్సులోకి ఎక్కే ప్రయత్నం చేస్తున్నారు. నిండుగా వున్న సముద్రంలోకి, వరదలతో నదినీళ్ళువచ్చి చేరినట్లుగా, ఆ బస్సులో మరింత జనం చోటు చూసుకొనే యత్నాలు చేస్తున్నారు. కండక్టరు ఒకసారి బస్సులోని జనాభాను ముందుకు కదలమని హెచ్చరించాడు. వెనుకనుంచి జనం తోపిడి, కండక్టరు హెచ్చరిక—బస్సులో జనం కదిలారు.

—క్షణం తర్వాత మనోహర్ చేతిలోకి ఆ గోధుమరంగు

ప్యాంటులోని నల్లరంగు బలిసిన పర్సు చేరింది.

—అలవాటైన చెయ్యి. అలవాటైన చెయివాటుతనం. పనితనం కూడా అలవాటైనదే. అందుకే పర్సు మనోహర్ జేబులోకి వెళ్ళిపోయింది.

—బస్సు కదిలింది, గేరు మార్చుకొంటూ.

—మనోహర్ గుండెల్లో గేర్లు మారిపోయాయి.

ఏంచేశాడు తను?

వద్దనుకొంటూనే వున్నా, ఎందుకు చేశాడు ఈపని? తను జీవితంలో తన మాటకే కట్టుబడి ఉండకపోతే, ఇంక ఏశక్తి తన్ను ఆపగలదు? ఏ శక్తికి తన్ను పాకుడు రాళ్ళనుంచి తీసి పవిత్ర స్థలంలో వుంచగలిగే సార్థకత వుంటుంది?

—ఎవరికోసమోకాదు. తనకోసం. కేవలం తనకోసమే మాత్రమే తను మారాలి. తన జీవితాన్ని తన్ను మాత్రమే మార్చుకోవాలి. వినీల అందిస్తున్న చేయూతతో, తన్ను - తనున్న పాప పంకిలంలోంచి తీసి, పదిమందితో బాటుగ పవిత్ర జీవితం పంచుకొనేలాగున చేసుకోవాలి. జీవితానికి ఓ అర్థం, ఓ సార్థకత ఏర్పరుచుకోవాలే గానీ, ఇలా ఆహ్వానించే చెడును అందుకొంటూ పోతే ....ఈ జారుడు మెట్లలోంచి అలా, అలా....ఎక్కడ ఆగుతుంది తన పతనం?

—వద్దు. తనలో ఇంకా బతికివున్న ఆ రాక్షసుణ్ణి సమూలంగా నాశనం చేయాలే తప్ప. ఇలా....కుదరదు.

—తను చేసిన తప్పు, తను సరిదిద్దుకోవాలి.

ఈ పర్సును మళ్ళీ అతనికే ఇచ్చేయాలి!

'మీ పర్సు కిందపడింది' అంటూ ఇచ్చేస్తే....? అది హాస్యాస్పదంగా వుంటుంది. పోనీ, మళ్ళీ తనే అతని జేబులో వుంచేస్తే ....అవకాశంకోసం చూస్తున్నాడు.

జేబులో వున్న పర్సు తన్ను పోగొట్టుకోవద్దని పదే పదే పోరుతున్నా, మనోహర్ మాత్రం ఆ ఆహ్వానాన్ని కొంచెం దూరంగానే వుంచగలిగాడు.

బస్సు ఆగగానే, జేబులోంచి పర్సుతీయటం, అది అతని పాంటులో తిరిగి పెట్టేసే యత్నం చేయటం....ఈలోగానే ఎవరో 'దొంగ, దొంగ!' అనటం అన్నీ క్షణకాలంలోనే జరిగిపోయాయి.

వెనకనుంచి ఎవరో మనోహర్ షర్టు పట్టుకోవటం, ముందునుంచి మరెవరో అతని చేయి పట్టుకోవటం....మనోహర్‌కు తెలుస్తూనే వుంది.

బస్సులో కలకలం.

బస్సు ఆగిపోయింది.

కండక్టరు ముందుకొచ్చి మనోహర్‌ను చూస్తూ అన్నాడు—"వీడా? వీడు పాతకేసే సార్!"

మనోహర్ చేతిలోని ఆ పర్సు నల్లగావుంది. మనోహర్ జీవితాన్ని కాటు వేయడానికి సిద్ధంగా వున్న కాలతాచులా వుంది. నల్లని ఆ పర్సు మనోహర్‌ను రెడ్‌హాండెడ్‌గా పట్టిచ్చింది.

బస్సులోంచి మనోహర్‌ను పదిమందికలిసి, తోస్తూ. కిందకు దింపారు. బస్సులో మిగిలిన జనాభా కిటికీల్లోంచి ఆ వింతను చూస్తున్నారు.

పర్సు కొట్టేయటం పెద్దనేరంగా కాక, దొరికిపోవటం నేరంలా అనిపించింది మనోహర్‌కు.

ఎవరెవరో ఏదేదో అంటున్నారు. అన్నిటికీ పర్యవసానంగా అతనిమీద వరుసగా దెబ్బలు తగిలాయి.

ఒకటి. రెండు, మూడు....

తప్పు నిజంగా చేసినన్నాళ్లూ శిక్షలేకపోయింది. తప్పు చేయకూడదనుకొని నిర్ణయించుకొన్న రోజున ఈ శిక్ష!

—మనోహర్ కళ్ళల్లో నీళ్ళు నిండుకొన్నాయి.

కొట్టినవాళ్ళు కొట్టగా, తిట్టినవాళ్ళు తిట్టగా, చూసినవాళ్ళు చూడగా, మనోహర్ జీవితంపై మరో మచ్చపడింది.

బస్సు కదిలి వెళ్ళిపోయింది.

మనోహర్ నెమ్మదిగా లేచాడు - నిలువలేక, నడువలేక జవచచ్చిన వాడిలా....

—అతని కళ్ళకు ఎదురుగా, దూరంగా నిలబడి తనకేసే చూస్తున్న వారిజ కనపడింది.

మనసు పొరల్లోంచి పొంగివస్తున్న అవమాన భారాన్ని కష్టం మీద ఆపుకొంటూ అటుకేసి నడిచాడు.

వారిజ అతన్నిచూపి అసహ్యం అంతా ముఖంమీదకు తెచ్చుకొంది. ఆమెను పలుకరించాలా, వద్దా అన్న సందేహానికి జవాబు దొరకక, క్షణం అక్కడే నిలబడ్డాడు.

## 7

"మీరు నన్ను గుర్తు పట్టారా?" సగం చచ్చి అడిగిన ప్రశ్న అది. మనోహర్ ఎన్నివిధాలుగా మనసులో అనుకొని, చివరకు పెదవుల మీంచి వచ్చిన పలుకులు అవి. అడగవలసిన అవసరం లేదు, ఆవిడ ముఖంమీద ఆ అసహ్యం కొట్టొచ్చినట్లు కనిపిస్తోంటే, ఆ ప్రశ్న అడగటం కేవలం ఆమెతో మాట్లాడాలనే!

వారిజ ఒకసారి మనోహర్‌కేసి చూసింది.

—తెల్లని బట్టలు. జీవితంలోనే వచ్చిన మచ్చకు ప్రతిబింబమా అన్నట్లు ఆ తెల్లని బట్టలమీద అక్కడక్కడ మాపిన మరకలు. ఆ మరకలు అతను బస్సు ఎక్కిన క్షణంలో లేవు. కానీ-బస్సు ఎక్కుతున్న క్షణంలో అతనిలో లేనివెన్నో ఆ తర్వాత కలిగాయి—ఎన్నో రోజుల తర్వాత మళ్ళీ జీవితాన్ని వెనక్కు తిప్పుకోవాలనుకోవటం, కూడా బస్సులో కలిగిన మార్పే! కాని, ఆ తప్పు చేయకూడ దనుకోవటం, అనుకున్నాక మళ్ళీ....

"ఎవరు మీరు?"

—వారిజ అలా అడుగుతుందని అతనికి తెలుసు. అందుకే ఆశ్చర్యపోలేదు. నెమ్మదిగా అన్నాడు—"నాపేరు మనోహర్. మీ వసీలరేఖగారి స్నేహితుణ్ణి!"

"అయితే ఏంకావాలి?" అంది వారిజ అసహనంగా.

"మీరేమీ అనుకోనంటే, మీతో ఓ అయిదునిమిషాలు మాట్లాడే అవకాశం ఇవ్వండి."

"దేనికి?"

"అగి చెప్పాలనే నా కోరికా....."

"నాకు కుదరదు. అయినా నాతో మీకు మాటలేమిటి?"

"మీకు నాతో ఏమీ వుండకపోవచ్చును. కానీ నాకు....అలా వస్తారా, ప్లీజ్...."

వారిజ ఆశ్చర్యపోయింది. ఏంచెబుతాడు ఇతను?

"ఇలాగా? ఇపుడా?...."

—మనోహర్ ఒకసారి సిగ్గుపడ్డాడు. నిజమే, ఇలాటి తన వేషంతో....

"వద్దండీ, పోనీ, మీ ఇల్లుచెబితే, నేను వస్తాను...."

"మా ఇంటికా?"

"పోనీ, ఎక్కడకయినాసరే—"

"అయినా అంత అవసరమా?"

"అవును. ఈ రోజునే మాట్లాడాలి. తప్పదు" అన్నాడు మనోహర్.

క్షణం ఆగి అంది వారిజ—"ఓ పని చెయ్యండి. ఓ గంట తర్వాత సైఫాబాద్ కామత్ హోటల్‌కు రండి. నేను మీకోసం అక్కడ చూస్తుంటాను."

"తప్పకుండా వస్తాను—" అంటూ వెంటనే మనోహర్ అక్కడినుంచి కదిలాడు.

—వారిజ తనతో మాట్లాడటానికి ఒప్పుకొంటుందనుకోలేదు అతను. అయినా వారిజ అతనితో కలిసి కాఫీ తాగటానికి కూడా ఒప్పుకొంది. అదే అతనికి ఆశ్చర్యం కలిగించింది.

రూముకొచ్చి బట్టలు మార్చుకొన్నాడు.

—తెల్లటి బట్టలు మార్చి మరో జత వేసుకోవటం అంటే పాత జీవితాన్ని మార్చి కొత్త జీవితపు తొడుగు తొడుక్కుంటున్నట్లుగా ఉంది అతనికి. కానీ, శరీరం ఒకటే—ఆ శరీరం మీది మచ్చలూ అవే!

అసెంబ్లీముందు చెట్లన్నీ నీడలు పరుచుకొని నిశ్చింతగా వున్నాయి. మనోహర్‌కు ఎప్పుడైనాసరే, అసెంబ్లీముందు కొచ్చే

సరికి మనసంతా హాయిగా వుంటుంది. ఎదురుగావున్న గన్‌పార్క్, వెనుకనుండే పబ్లిక్ గార్డన్స్, ఇంకోపక్కన క్లాక్‌టవర్, దానికి మరోపక్కన వల్లభాయ్‌పటేల్ విగ్రహం....ఎంతో ఆహ్లాదకరంగా వుంటుంది ఆ వాతావరణం అంతా. కానీ, ఈరోజు మాత్రం మనోహర్ ఆ ప్రశాంతతనూ, ఆ అందచందాలనూ గమనించి చూచే పరిస్థితిలోలేడు. అందుకే ముందుకు నడిచాడు. రవీంద్రభారతి దాటి, హోటల్ ముందుకొచ్చాడు. లోపలికి వెళ్ళి తొంగి చూడటమా, లేకపోతే అక్కడే నిలబడి వుండటమా అని క్షణం సంశయించి నిలబడ్డాడు.

అంతలోనే అతనిముందు ఆటోదిగుతూ వారిజ కనబడింది.

నవ్వుతూ అంది—"సారీ, కొంచెం లేటయింది."

ఆటోకు డబ్బులిచ్చి పంపేశాక, దగ్గరగా వచ్చి అంది—"పదండి. లోపల కూర్చుందాం."

ముందు వారిజ లోపలికి నడుస్తోంటే, వెనుకనే మనోహర్ వెళ్ళాడు.

తలవంచుకొని కూర్చున్నాడు మనోహర్. అతన్నిచూసి నవ్వుకొంటూ అడిగింది వారిజ-"చెప్పండి, ఏమైనా తీసుకొంటారా?"

మనోహర్ ఒక్కసారి ఆమెకేసి చూపి తల వంచుకొన్నాడు.

"ఈరోజు భోజనం చేశారా, లేదా?"

మనోహర్ ఈసారి ఏమీ అనలేదు.

బేరర్ రాగానే నెమ్మదిగా అంది వారిజ—"వన్ మీల్స్, వన్ కాఫీ—"

బేరర్ వెళ్ళిపోగానే అంది వారిజ—"ముందు భోజనం చేయండి. ఆ తర్వాత చెబుదురుగాని!-అయినా మీరేం చెబుతారో నాక్కొంచెం తెలుసు. ఆ క్షణంలో చూపినదేకాక ఇంకొంచెమూ తెలుసు నాకు!"

"అంటే?—" మనోహర్ హఠాత్తుగా అడిగాడు.

"భోజనం కానీండి" అంది వారిజ కాఫీ కప్పును తన దగ్గరకు లాక్కుంటూ.

మనోహర్ ఏమీ అనలేదు—జీవితంలో అన్నీ పోగొట్టు కొన్న వాడిలా. కానీ అన్నీ తిరిగి పొందాలనే కోరిక వున్నట్లుగా వున్నాడు.

భోజనం పూర్తయింది. చెయ్యి కడుక్కొని తిరిగివచ్చాక అంది వారిజ—"చెప్పండి."

"మీరేం చూశారు?"

"మీరేం చేశారో అది!"

"అంటే....!—" అని క్షణం ఆగిపోయి, ఆ తర్వాత అన్నాడు మనోహర్—"ఇపుడు తల్చుకొంటే నవ్వొస్తోంది. జీవితంలో కొన్ని కోరుకోకుండానే మనల్ని చేరుకొంటుంటాయి. కోరుకొన్న వెన్నో ఏ కోశానా అందవు."

మనోహర్ ఆగగానే అతనికేసి పరీక్షగా చూసింది వారిజ—మనసులోని ఘర్షణ అంతా ముఖం మీదకు ప్రస్ఫుటంగా తేలి వస్తోంది.

"చెప్పండి. వింటున్నాను."

"మీరు వినీలరేఖగారికి మంచి స్నేహితులు. ఆరోజు ఆవిడ పక్కన మీరు వుండటంతోనే తెలిసిపోయింది నాకు, మీకు ఆవిడకూ వున్న స్నేహం ఏమిటో! అందుకే నేను మీకు దూరంగా బతకాలను కొన్నాను. కానీ .... తమాషా ఏమిటంటే, మీకు దగ్గరగానే నా జీవితం జరుగుతోంది. సినిమాలో టిక్కెట్లూ మీకే అమ్మాను. ఈ రోజు ఈ సంఘటన మళ్ళీ-" మనోహర్ క్షణం ఆగి అన్నాడు-"తమాషా ఏమిటంటే, ఒక్కోసారి నిజం చెప్పాలన్నా అది హాస్యాస్పదంగా కనిపిస్తుంది. చెబుతున్నది నిజమే అయినా, అది అబద్ధం కన్నా అబద్ధంగానే కనిపిస్తుంది. ఈరోజు జరిగిన సంఘటన.... మీ ఊహ ప్రకారం నేను జేబుకొట్టేస్తూ దొరికిపోవటం అని! ఔనా?"

వారిజ ఏమీ అనలేదు.

"పోనీండి, మీరు నమ్మండి, నమ్మకపొండి-కానీ మీకు నిజం చెబుతాను. ఆ నిజాన్ని నమ్మి, నన్ను నమ్ముతారో లేకపోతే నన్ను నమ్మక నిజాన్ని అవమాన పరుస్తారో మీ ఇష్టం. కానీ నేను

చెప్పేది నిజం-ఈరోజు నేను జేబుకొట్టేపిన మాట మాత్రం నిజం. కానీ దొరికిపోవటం మాత్రం, ఆ కొట్టేసిన పర్సు మళ్ళీ ఇచ్చేయా లని ప్రయత్నించినపుడు।—మనసులోంచి తప్పు చేస్తున్నానన్న బాధతో, నన్ను సరిదిద్దుకోవాలనే ప్రయత్నంలో నేను చేసినపని తప్పయిపోయింది. పర్సు తిరిగిపెట్టేసే ప్రయత్నంలో దొరికిపోయిన నన్ను వాళ్ళు పట్టుకోవటం జరిగింది."

వారిజ ఏమీ అనలేదు, అతను చెప్పేది వినటం తప్ప.

"ఇంతవరకూ మీకు తెలుసు. ఈ తెలిపిన సంఘటన మాత్రం దయచేసి మీ స్నేహితురాలికి చెప్పకండి."

"విన్నీకా?"

"ఆ—ఆ వినీలరేఖగారికే।"

"ఆవిడకు తెలిస్తే మీకేమిటి నష్టం?"

"మీకు తెలుసో తెలీదో గానీ, ఈ రోజు నేను దొరికి పోవ టానికి కారణం ఆవిడే। ఆవిడకు నేనిచ్చినమాట-నన్ను నేను మార్చుకొంటాననీ, తప్పుదారి తొక్కననీ ఇచ్చిన మాటమీద నిలబడ టానికి చేసిన ప్రయత్నం అది।—ఈ సంఘటన ఆమెకు తెలిస్తే.... వద్దు. జీవితాన్ని సరిదిద్దుకొనే అవకాశం ఇచ్చిన స్త్రీ ఆమె. ఆమెకీ సంఘటన తెలిస్తే, నా జీవితం మళ్ళీ ఏమవుతుందో. మళ్ళీ ఏ చీకటి దారి బాటసారిని అవుతానో అన్న భయం నాది। చదువుకోవడానికి ఆమె నెల నెలా చేస్తున్న సాయం ఆగిపోవటంతోబాటుగా, ఓ మంచి వ్యక్తి స్నేహాన్ని ఆసరాగా చేసుకొని, జీవితం మార్చుకోవాలని నేను చేస్తున్న ప్రయత్నమూ విఫలమయిపోతుంది. అందుకే.... అందుకే...." ఆగిపోయాడు మనోహర్.

"మీరు నాకు కనపడ్డ రెండుసార్లూ ఇలాగే...."

"కనబడ్డాను. అది నా దౌర్భాగ్యం. కానీ, ఈ రోజు మీముందు ఒక్క అవకాశం ఇవ్వమని కోరుకొంటున్నా. నన్ను నమ్మండి."

వారిజ ఏమీ అనలేదు. ఇద్దరిమధ్యా నిశ్శబ్దం.

వారిజ లేచి నిలబడింది. "పదండి, పోదాం!" అంటూ.

మనోహర్ లేచాడు.

హోటల్ ఆవరణ దాటి బయటకురాగానే మళ్ళీ అన్నాడు మనోహర్: "చెప్పండి, మీరు ఈ సంగతి...."

"విన్నుతో చెప్పను—కారణం మీరు చెప్తారనికాదు. నేను చూశాను కనుక?—"

"ఏం చూశారు?"

"మీరు పర్సుకొట్టేయటం నేనూ చూశాను. కానీ, ఆ తర్వాత చాలసేపటికి కానీ ఈ గొడవ జరగలేదు. అందుకే, బహుశా మీరు చెప్పినట్లు తిరిగి పెట్టేటపుడే ఇలా జరిగి వుండొచ్చు!—పోనీండి, కొన్ని కొన్ని సంఘటనలు మనం త్వరగా మర్చిపోతే మంచిది. మీరూ ఈ సంఘటన జరగలేదనే అనుకోండి."

—మనోహర్ కళ్ళనిండా ఆమెపట్ల కృతజ్ఞత.

## 8

టాంక్‌బండ్ గట్టుమీదనుంచి నిలబడి చూస్తోంటే, ఎక్కడికో వెళ్ళిపోతున్నట్లుగా ఆ సూర్యుడు ఎర్రగా ముఖం అంతా కందగడ్డలా చేసుకొన్న పెళ్ళికూతురిలా వున్నాడు, వారిజకు. సూర్యుణ్ణి ఆడవస్తువుతో పోల్చటం తప్పేమో అనీ అనుకుంది కానీ, పోలిక ఎర్రదనం వరకే గదా అని తన్ను తానే సర్ది చెప్పుకొంది.

"పిన్నీ, అక్కడ చూశావా. రైలు...."

—వారిజ ఒకసారి అటుచూసింది. హుసేన్‌సాగర్ అవతలి గట్టుమీద రైలు నెమ్మదిగాపోతోంది. దూరాన్నుంచి చూస్తోంటే ఇంత అందంగా అవతలిగట్టు కనిపిస్తోందే కానీ, దగ్గర చేరితే ఏముంటుందీ. అది ఇవతలిగట్టుకు ప్రతిబింబం మాత్రమే!

—జీవితమూ అంతేనా అనిపించింది వారిజకు. దూరాన్నుంచి చూస్తే కొన్ని సంఘటనలు ఎలాగో కనిపిస్తాయి కానీ, దగ్గరకు వెడితే, ఆ సంఘటనలోని ఎత్తుపల్లాలు తెలుస్తాయి.

—నిజమే, తను కళ్ళారా చూపింది కనుక నమ్మిందికానీ, లేకపోతే అతను చెప్పేది నమ్మ బుద్ధికలిగేదిలాలేదు. అతను.... అవును, అయినా తన ఆలోచనలు అతనిచుట్టూ తిరుగుతున్నాయి

ఎందుకో అనుకొంది వారిజ.

అతను వినీలకు స్నేహితుడు.

చెడులోంచి మంచి మార్గాన పడాలని కోరుకొంటున్న వ్యక్తి. నూతిలోని వ్యక్తిని పైకి తీసుకురావాలే గానీ రాళ్ళేయ్యకూడదు అనేది వారిజకు తెలీందికాదు. కానీ వినీల ఎలాగైనా మంచిది. అందుకే రాళ్ళేయ్యకపోవడమేకాదు, సాదరంగా చేయూతనిచ్చి, మళ్ళీ మామూలు మనిషినిచేసే యత్నంచేస్తోంది. ఎంతమందికి అలాటి ఊహ కలిగేను? ఎంతమందికి అలాటి అవకాశం దొరికేను??

—వారిజ ఆలోచనలన్నీ అలా వినీలరేఖ చుట్టూ ముసురుకున్నాయి.

"పిన్నీ....ఓ పిన్నీ...."

"చెప్పరా!" అంది వారిజ.

"మమ్మల్ని అవిచూపిస్తా, ఇవిచూపిస్తానంటూ తెచ్చావేకానీ, ఏమీ చెప్పవేం? ఏమీ చూపించవేం?" అనేది ప్రశ్న. ప్రశ్నవేసింది వారిజ పెదనాన్నగారి పిల్లలు. హైదరాబాద్ చూడాలనే కాంక్షతో వచ్చిన వాళ్ళకు ఊరు చూపిస్తానంటూ టాంక్‌బండ్ గట్టుకు తెచ్చింది వారిజ.

ఆ ప్రశ్నకు నవ్వొచ్చింది వారిజకు.

"సరే, ఇదుగో, ఇటుప్రక్క ఉండేది అంతా హైదరాబాద్. అటు వుండేది అంతా సికిందరాబాద్...."

"అది మాకూ తెలుసు. ఇంకేమైనా చెప్పు...."

"అక్కడ, ఆ కొండమీద ఉందిచూడండి, అదేమో...." అంటూ అటువేపుకు చూపిస్తున్న వారిజకు, నెమ్మదిగా ఫుట్‌పాత్ మీద వస్తున్న వినీలరేఖ కనబడింది. ఒంటరిగా వస్తున్న స్నేహితురాల్ని చూస్తే సంతోషం కలిగింది వారిజకు.

"ఇదిగో, అదేమో వెంకటేశ్వరస్వామి కోవెల, సరేకానీ, మీరు ఏమీ అల్లరిచేయక ఆడుకుంటూ ఉండండి. రాత్రి మీకు ఈ ఊరు ఎలాపుట్టిందో చెబుతాను, సరేనా?" అంటూ వాళ్ళను మెల్లగా పక్కకు పంపి, స్నేహితురాలికి ఎదురెళ్ళింది వారిజ.

"హలో మాస్టారూ...." అంది నవ్వుతూ పలకరిస్తూ.

"మాస్టార్ని కానే, మాడమ్‌ని!" అంది వినీలరేఖ.

"నువ్వు మేడమ్‌వేనన్న సంగతి నాకు తెలీంది కాదు కానీ, కావాలనే నిన్ను నేను మాస్టారూ అన్నాను."

"ఏం?"

"జీవితంలో పాఠాలు నేర్పుతున్నందుకు!"

వినీలరేఖ ఆశ్చర్యపోయింది; "ఏమిటది?"

నవ్వేసింది వారిజ—"నిన్న మీ స్నేహితుడు కనబడ్డాడు."

"ఎవరు? మనోహరా?"

"ఆ, అతనే! అయినా అతనుకాక యింకా ఉన్నారా ఏం నీకు మగస్నేహితులు?"

"ఆ—అనాథశరణాలయంలో ఓ యాభై మంది వరకు మగ స్నేహితులు, బంధువులూ ఉన్నారునాకు!" అంది వినీలరేఖ నవ్వేస్తూ

"ఇతనూ అదే బాపతు అనుకుంటాను!"

"కాదేమోలే, నాకు ఇంకా సరైన డీటైల్సు తెలీవు.... అయినా నీకు అతను ఎందుకు కలిసాడు?"

తత్తరపడింది వారిజ—"ఆ—బస్సు దిగుతోంటే అక్కడే ఉన్నాడు. నన్నుగుర్తుపట్టి పలకరించాడు. 'నేను వినీల రేఖ స్నేహితుడినండీ!' అంటూ. అతనికి నువ్వంటే చాల...." ఆగి పోయింది వారిజ ఏమనాలో తెలీక.

"....గౌరవమా, కృతజ్ఞతా, ఏమిటది!"

"అపుడే ఇంకా ఏపేరూ పెట్టొద్దులే దానికి." ఆగిపోతూ అడిగింది వారిజ—"నీ సంగతి ఏమిటో చెప్పు"

వినీలలేఖ ఏమీ అనలేదు.

"వారిజా-మనసులో ఉన్నది ఇంకొకరికి చెప్పుకుంటే కొంత బరువు తగ్గుతుందంటారు. నేను నీకు చెబుతాను—నా గతజీవితం ఏమిటో నీకు తెలీందికాదు. ఎందుకు పుట్టానో, ఏం సాధిస్తానో తెలీని జీవితం. ఎవరికి పొందక ఒంటరినని చెప్పుకోగలిగే అవ కాశమూలేదు. పదిమంది బంధువులు నాకున్నారని చెప్పుకోగలిగే

అదృష్టమూలేదు. లెక్క పెడితే వందదాటి తీరుతుంది నా బంధువుల సంఖ్య. కానీ ఏ ఒక్కరికీ నా జీవితం అంటే ఏ శ్రద్ధాలేదు. ఏదో చదివిన చదువుకు తగ్గ ఉద్యోగం దొరికింది. అంతవరకూ అదృష్టమే. కానీ, ఇలాంటి జీవితం ఎంతకాలం అని ఆలోచిస్తే మాత్రం వంట్లోంచి వణుకొస్తోంది."

"అది వయసు తప్పేమోనే!" అంది వారిజ నవ్వుతూ.

"నేను నీకు నాజీవితం గురించి ఇంత సీరియస్‌గా చెబుతోంటే నువ్వేమో యిలా తీసేస్తే...."

"సారీ, విన్నూ—తమాషాకు అన్నానేకాని నీకు బాధకలుగుతుందని కాదు, కలగాలనీకాదు" అంది వారిజ నొచ్చుకుంటూ.

"పోన్లే—ఎంతవరకూ చెప్పాను?..."

"వంట్లోని వణుకు...."

ఇద్దరూ పకపకా నవ్వుకున్నారు.

"కొంతకాలం ఒంటరి తనపు జీవితంలో అంతహాయి లేదనే అనుకున్నానేగానీ, అది పెద్ద న్యూసెన్సే! ఒంటరిగా ఆడదివుండి ఉద్యోగం చేస్తోందీ అంటే అందరికీ లోకువే. డబ్బుకు లొంగుతుందని కొందరి వూహైతే, కోరికకే లొంగుతుందని కొందరి ఆశ. అంతేగానీ....పోనిద్దూ, ప్రపంచమే అలాగేవుంది. దానికి నువ్వూ నేనూ ఏంచేయగలం?" అంటూ ఆగి అంది మళ్ళీ వినీలరేఖ—"ఆఖరికి ఒకరిద్దరు దగ్గర చేరితే అన్నాను పెళ్ళిసంగతి ఏమిటని. ఉలికిపడ్డారు వాళ్ళు. అమ్మాయి కావాలేకాని పెళ్ళి అక్కర్లేదు. రోజూ ఊరికే దొరికే శరీరం అయితే సరే గానీ, బాధ్యతలు మాత్రం వద్దుట!—ఛీ అనిపించింది నాకు. అందుకే ఇపుడు అనుకుంటున్నాను—ముసలో, ముతకో, కుంటో, గుడ్డో — ఎవరో ఒకరు ఒక మగాడు అనేవాడు ఆడదానికి ఉండితీరాలి. తప్పదు. ఒంటరి ఆడది ఈ ప్రపంచంలో బతకటం అనేదికల్ల. అందుకే అంటున్నాను, పెళ్ళిచేసుకోవాలని ఉందని!—"

వారిజ నవ్వుతూ అంది—"ఇన్నాళ్ళకు జ్ఞానం కలిగిందన్న మాట!"

"ఆలస్యంగానైనా కళ్ళుతెరు అనేది సూక్తి. యిప్పటికి తెరిచా!"

"తెరిచి, ఏం చేస్తున్నావ్?"

వినీలరేఖ వారిజకేసి చూపింది. వారిజ అడిగిన ప్రశ్నకు వెనుకవుండే ఆ ఉద్దేశం ఏమిటో తెలుస్తోనే ఉంది—అయినా ఒక్క-క్షణం ఊరుకుండి పోయింది.

వారిజే అందిమళ్ళీ—"చెప్పావుగా, మొన్న మీస్నేహితుడు కనబడ్డాడు."

"చెప్పావుగా! మళ్ళీ చెబుతున్నావేం?" వినీలరేఖ నవ్వింది. ఆ నవ్వులో 'దొరికిపోయానా?' అన్నప్రశ్న కనిపించింది. అయినా వారిజ మళ్ళీ అడిగింది—"ఏమిటి అతనికీ నీకూ సంబంధం?"

వినీలరేఖ పకాలున నవ్వుతూ అంది—"ఇంతవరకూలేదు."

"ఇకపైనో?—"

"పైవాడు చెప్పాలి అది."

"నీసంగతి చెప్పవోయ్!"

"అసలు సంధ్యవేళ అబద్ధం చెప్పటం దేనికి? దేవుడు చల్లగా చూస్తే, మనోహర్ మంచివాడైతే నా ప్రయత్నాలు దాదాపుగా విజయవంతం అయినట్టే!"

వారిజ ఒక్క-క్షణంవుండి అంది—"విన్నా—నువ్వు అతనికి సాయం చేస్తున్నావు. కానీ, ప్రతిఫలం కోరుతూనే వున్నావు. ఇలా ప్రతిఫలం కోరుతూచేసే సాయం గురించి నాకు మంచి అభిప్రాయం లేదు."

"నిజమే, నా ఊహ అదే! కానీ....ఏం చేయను? పరిస్థితులు అలాటివి. కట్నం ఇస్తేగానీ కొండమీది కోతి అయినా కిందకి దిగని స్థితి."

"అంటే, కట్నం ఇలా ఇన్‌స్టాల్‌మెంట్స్‌లో యిచ్చి...."

వారిజను ఆపుతూ అంది వినీలరేఖ—"ఛ అలా అనకు! ఒకవేళ మనోహర్‌ను నేను ఇప్పటికి పెళ్ళిచేసుకున్నా ననుకో. అప్పుడు చదివించుకుంటే....?

"పెళ్ళి అయాక సంగతులువేరు. కానీ ఇది పెళ్ళికని రోజుల్లో యిస్తున్న వాయిదా పద్ధతి కట్నం—నువ్వు ఒప్పుకోకపోయినా ఇది నిజం!"

"అయినా వారిజా—అందులో మాత్రం తప్పుందా?"

"కట్న ఇవ్వటం అనేది తప్పో రైటో నిర్ణయించుకుంటే సరి—కట్నం యివ్వటం అనేది తప్పయితే యిదీ తప్పేమరి!"

"నిజమే — పోనిగానీ, దీనికి యిపుడే కట్నం అనిపేరు పెట్టకు! అతనికి నాలోవున్న ఈ దూరాలోచన—"

"అబద్ధం. నీది దురాలోచనే—అతన్ని వల్లోనో, ఒళ్ళోనో వేసుకోవాలనే నీది దురాలోచనే—"

"పోనీ, అదే. అతనికి తెలీదు. ఆ రోజుకు పరిస్థితులు ఎలా వుంటాయో ఏమో!—"

—చుట్టూ చీకట్లు ముసురుకుంటున్నాయి.

టాంక్ బండ్ మీద ఉండే దీపాలు ఆ చీకట్లతో గిల్లికజ్జా మొదలు పెట్టుకుంటున్నాయి. స్నేహితురాళ్ళు ఇద్దరూ పిల్లలతోసహా నడక మొదలు పెట్టారు.

## 9

మనోహర్ వెళ్ళేసరికి వినీల ఒక్కతే కూర్చొని పుస్తకం ఏదో చదువుకుంటోంది. కుంపట్లో బియ్యం కుతకుత వుడుకుతుంటే కుంపటి ప్రక్కనే కూర్చుని పుస్తకంలో ఏదో సన్నివేశాన్ని బహు శ్రద్ధగా చదువుతోంది.

మనోహర్ తను వచ్చినట్టుగా నెమ్మదిగా ఒకసారి దగ్గాడు.

వినీల ఒకసారి పుస్తకంలోంచి తలెత్తింది—"మీరా, రండి" అంది ఆహ్వానిస్తూ.

లోపలికి వచ్చాడు మనోహర్.

"ఈవేళ మీరొస్తారనే అనుకున్నాను. యింత సేపటివరకూ రాకపోతే, యింక రారేమోననీ అనుకున్నాను."

"ముందే వద్దామనుకున్నా, కానీ వీలుపడలేదు." నవ్వుతూ అన్నాడు మనోహర్. "అయినా వేళకే వచ్చినట్లుగా వున్నాగదా!"

అన్నాడు కుంపట్లో వుడుకుతున్న బియ్యాన్ని చూస్తూ, పరిహాసంగా.

"నిజమే—ఇందులో మీక్కూడా షేరుంది" అంది వినీల.

"చెప్పండి. ఎలావుంది మీచదువు. ఎలావుంది మీవ్యాపారం ఎలా వున్నాయి మీ కోళ్ళూ. గుడ్లూ...."

మనోహర్ నవ్వేశాడు.

"ఈమధ్య గుడ్లుపెట్టటం మానేశాను. చేస్తున్న పని అంతా కేవలం చదువుకోవటం!"

"థాంక్స్!"

"మధ్యలో మీ థాంక్సేమిటి? చెప్పాల్సింది నేనుగదా!"— అంటూన్న మనోహర్‌ను వారిస్తూ అంది వినీల—"ఊ—ఖర్చుపెట్టే డబ్బు సద్వినియోగమే అవుతోంది గదాననే తృప్తి కలుగ జేస్తున్నందుకు!"

"మీ నమ్మకం అలాటిది, అంతే!"

"కాదనను. కానీ, చెప్పాగదా. నమ్మకంమీద బతకటం నా లక్ష్యమని!"

"మీరు తమాషా వ్యక్తులండీ బాబూ! లోకమంతా ఎవరు నమ్మితే వాళ్ళను ముంచడం చేస్తున్నపని. మీరేమో ఇలా...."

"లోకం అందరి సంగతీవద్దు. మీసంగతి చెప్పండి. నన్ను మోసం చేయగలరనే మీఊహ?"

"జవాబు చెప్పను!" అన్నాడు మనోహర్.

"అదేం?" ఉలికిపడి అడిగింది వినీల.

"ఎందుకంటే, ఇది స్వవిషయం కనుక! మీరు నన్నునమ్మి డబ్బు యిస్తున్నారు. ఇవ్వకపోయినా పర్వాలేదని అన్నారు. ఇక యివ్వటం యివ్వకపోవటం అనేది నాయిష్టం కదా?"

ఔనన్నట్లుగా తల ఊపింది వినీల.

"కానీ, మీరన్నట్లుగా నాకు మంచి నమ్మకం, నా డబ్బు ఎక్కడికీపోదు. అణా పైసలతోసహా తిరిగి రానే వస్తుంది. అది నాకుబాగా తెలుసు!"

"సర్లెండి, ఆ సంగతికేం గానీ .... నా నెలజీతం కోసం

వచ్చాను."

"మీరు రాగానే ఆసంగతి తెలిసింది—ఇస్తాను. వచ్చారు గదా. భోజనంచేసి మరీ వెళ్ళండి."

"అమ్మయ్య. ఇస్తానన్నారుగదా. ఇంక ఒక్క భోజనం ఏం ఖర్మ—ఏంచేయమన్నా చేస్తాను."

ఉలికిపాటుతో అతన్ని చూసింది వినీల. అదే సమయంలో మనోహర్ కూడా తను జారిన ఆమాటకు వస్తున్న మరోఅర్థాన్ని గ్రహించి, నాలుక కొరుక్కుంటూ, వినీలకేసి చూశాడు. ఇద్దరి చూపులూ క్షణం కలుసుకుని, మరోక్షణం కిందకు వాలిపోయాయి.

క్షణం ఆగి అడిగింది వినీల—"చెప్పండి, మీ చదువు విషయం ఎలా వుంది?"

తన్ను తాను సర్దుకొంటూ అన్నాడు మనోహర్—"ఏముందని చెప్పమంటారు—బండి గాడి మార్చుకొని, కొత్త గాడిలో పడింది. స్మూత్ సైలింగ్—నల్లేరుమీద బండి నడక అనుకోండి!"

"జీవితంలో ఒక మలుపు తిరుగుతోంటే, ఇబ్బంది లేదు గదా?"

"ఇబ్బందా?" నవ్వేశాడు మనోహర్—"ఇబ్బందేమిటండీ-జీవితంలో ఇలాటి మలుపుకోసం ఎన్ని అవస్థలుపడ్డానో మీకు తెలీదు. అలాటిది అనుకోకుండా అవకాశం అనేది వచ్చి తలుపు తడుతోంటే, అది అవస్థ అని అనుకొనే మూర్ఖుణ్ణిగాను!"

"మంచిది!" అనాలనుకొన్నా అనలేదు వినీలరేఖ.

కుంపటిలోంచి అన్నపుగిన్నె కిందకు దించింది.

"ఒక్క క్షణం ఆగితే, అన్నం తినేద్దాం"—అంటూ వినీల రేఖ గది అంతా శుభ్రం చేసుకొంటూ అంది మళ్ళీ—"చదువు అయిపోతే ఏంచేస్తారు?"

"ఏంచేస్తాను?....నాకు తెలీదు."

వినీల తలెత్తి అంది—"అది అన్యాయం కదా—చదువు అయ్యాక, ఏంచేస్తారో తెలీకుండా వుండటం అన్నంత అన్యాయమైన విషయం అదేకానీ, ఇంకోటిలేదు."

"కావచ్చు! కానీ ఏంచేయను? జీవితం ఎలావస్తే, అలా అందుకోవటం అలవాటు అయిపోయింది. నిన్నటివరకు వున్న జీవితంవేరు. ఈరోజు నాకున్న జీవితంవేరు. రేపు నాకోసం ఏం దాచిందో, నాకు తెలీదు. చదవటం అనేది ఈరోజు నా జీవితంలో అవసరం. ఆపని చేస్తున్నాను. రేపటి జీవితం రేపే ఆలోచించ గలను కానీ, ఆపని ఈరోజు చెయ్యమంటే చెయ్యలేను."

"అంటే ఆలోచించేంత టైంకూడా లేదంటారు!"

"అలా అనను. ఆలోచించి తల బద్దలు కొట్టుకొనేంత అవసరంలేదు, అలవాటూ లేదు."

నవ్వింది వినీలరేఖ.

"పోనీండి. నేను చెబుతాను—రేపటి మీ జీవితానికేం?— చదువుకొంటారు. ఏదో ఓ ఉద్యోగం సంపాదించుకొంటారు, ఆ తర్వాత...."

"ఓస్ ఇంతేనా, అయితే నేనే చెబుతాను—పెళ్ళిచేసుకొని, జీవితంలో సెటిలవుతాను! అంతేనా?" నవ్వేశాడు మనోహర్.

వినీలా నవ్వేసింది.

"రండి, భోజనం రెడీ—"

మనోహర్ లేచాడు.

భోజనం వడ్డిస్తున్నంతసేపూ, అతనితో కలిపి భోజనం చేస్తున్నంతసేపూ వినీలలేఖ మనసులో వువ్వెత్తున తరంగాలు. ఒక దాని తర్వాత మరొకటిగా ఆలోచనలు, ఈ ఆలోచనలకు గమ్య స్థానంగా మనోహర్!

—జీవితంలో తాను ఎప్పటికి ఒక స్థానాన్ని-కాదు, అతని పక్కన తన జీవితాన్ని పంచుకోగలిగే ఆస్థానాన్ని—పొందగలవా అనే ఆరాటం.

ఒంటరి తనపు జీవితంతో తను పూర్తిగా వెలిసిపోతున్న బొమ్మ అయిపోతోంది. అలాకాకుండా, జీవితంలోకి ఇతన్ని తెచ్చు కొంటే, కొండంత వెలుగు, జీవితమంత అండ.

కానీ....

ఎక్కడో తెలీని ఆరాటం. ఎక్కడో తెలీని భయం.

తను కోరుకుంటున్నది గొంతెమ్మ కోరికలు కావుగదా! అనే అనుమానం.

అయినా ఇతను—తను నాటిన మొక్క.

ఈ మొక్క వృక్షమై, పెద్దదై నిలిచినపుడు తన్ను, ఆనీడలో తలదాచుకోవడానికి ఆహ్వానించదా అనే ఆశ!!

—వినీల మనసులో కొండంత కోరిక!

భోజనం పూర్తయ్యాక, మనోహర్‌కు డబ్బు ఇచ్చింది వినీలరేఖ.

నోట్లు మడిచి జేబులో పెట్టుకొంటూ అన్నాడు మనోహర్-"జీవితం అందిస్తున్నారు మీరు నాకు? ఎపుడూ మీకు మోసం చేయను. నన్ను నమ్మండి!" అన్నాడు మనోహర్.

వినీలకు ఆ మాటల్లో కొత్త అర్థాలు కనబడ్డాయి.

## 10

—వారిజకు మనసంతా అదోలా అయిపోయింది, ఆ వార్త వినేసరికి.

అయిపోదూ మరి - మనిషిని నమ్మటంలో వున్న ఆనందాన్ని చవిచూపిన మనిషి వినీల. అలా నమ్మిన వ్యక్తినే మోసం చేయాలంటే మనసెలా వచ్చిందో అతనికి?

—వినీల అలా అనలేదు.

అనదు.

తను రోజూ పాలుపోసి పెంచుతున్నది పామే అయినా, అది తనవద్ద పాలుతాగి బతుకుతోంది, తనకు అపాయం తలపెట్టదనే పిచ్చి నమ్మకం వున్న సాధు జంతువు వినీలరేఖ.

దానికి తెలీదు. చెప్పినా అర్థం చేసుకోదు.

ఈ లోకంలోనే పుట్టిందిగానీ, ఈ లోకంగురించి ఆవంతైనా తెలీని మనిషి. ఎలా నెగ్గుకొస్తుందో ఏమో!

స్నేహితురాలు అంటే జాలికలిగినా, మరోపక్కన వినీల అంటే చెప్పలేని కోపమూ వచ్చింది—ఎంతగా చెప్పింది తను.

ఎంతైనా ఆ మనిషి అంతేనని!

'వెనుకటిగుణమేలమాను?' అన్నది ఎప్పటినుంచో వున్న ప్రశ్న. లోకాన్ని ఎన్నో రకాలుగా చూచి, అనుభవించి చెప్పిన వారందరి మాటా అదే!—కానీ వినీలరేఖది వేరుదారి.

వినీలకు అతనంటే ప్రాణం. రేపో మాపో అతనితో తన జీవితాన్ని సైతం పంచుకోవాలనే కోరికవున్న మనిషి వినీల!

కానీ-రెండు చేతులు కలిస్తే తప్పట్లు, రెండు మనసులు కలిస్తే పనువులు. అంతేకానీ, ఇలా అయితే.

ఎద్దు ఎండకు లాగితే, దున్న నీడకు లాగిందట!

—అవును.

ఇది తరతరాల సంఘర్షణ.

ఇక్కడ వినీల, అతను అని ఇద్దరు వ్యక్తులు ఉన్నారేకానీ, ఆ ఇద్దరూ చెరో గుణానికీ ప్రతీకలు.

వినీల-మంచికీ, మనిషిలోని మానవత్వానికీ శిఖరాగ్రం.

అతను—చెడుగుణాల పట్ట.

ఈ రెంటికీ లంగరు పొసగదు. వినీలవన్నీ కలలు. కలలలో కనిపించే జీవితంవేరు. నిజమై ఏక్షణానా జీవితంలోకి రాదనే జ్ఞానం లేని అమాయకురాలు వినీల.

—నిజమే, ఈ విషయంగురించి ఇంక ఆలోచించి లాభం లేదు. తను—తను ఈ విషయాన్ని సెటిల్ చేసేస్తుంది.

నమ్మిన మనిషిని ద్రోహంచేస్తూ జీవితాంతం బ్రతుకుతాడో, లేకపోతే, ఈ క్షణాన వినీల నమ్మకానికి నిప్పంటించి, హాయిగా ఆ తర్వాత వినీల జీవితాన్ని వినీలను బతకనిస్తాడో—తను తేల్చి వేస్తుంది.

ముసుగులో గుద్దులాట కన్నా ముఖాముఖీ చర్చలు మంచిది. ముఖానకుండ బద్దలు కొట్టినట్లుగా తేల్చి చెప్పుకోవటం మంచిది.

అది వినీలకు సరిపడని సంగతి.

కానీ—

తను, ఈపని తనే చేస్తుంది.

నిజం తెలుసుకొని—వినీలకు మెలుకువ తెప్పిస్తుంది. 'కలల జీవితం చాలు. వాస్తవంలోకి వచ్చి జీవితం దిద్దుకో!' అని చెప్పాల్సిన బాధ్యత, వినీల కున్న మంచి స్నేహితురాలిగా అది తన బాధ్యత.

బాధ్యతలనుంచి పారిపోవటం తనవల్ల కాని పని.

అయినా ఎలా చేయగలిగాడు ఈ పనిని?

—ఏం చెప్పింది వినీల!—'కనపడటం లేదట!'

'కనపడకుండా' పోవటానికి అదేం ఇంద్రజాలమా?

కాదు!

—వినీలకు తెలీదు. దానికి కారణం! ఆ అదృశ్యం కావించ గలిగేశక్తి ఎవరికివుందో తనకు తెలుసు!

అయినా ఒకటా, రెండా!—వందరూపాయల నోటు!

—పోదు! పోకూడదు!!

ముఖం చాటుచేసుకొని ఎంతకాలం ఉండిపోతాడీ పెద్దమనిషి మాత్రం? అయినా తను ఇపుడే ఇలాగేవెళ్ళి అతన్ని పట్టుకొని....

'మీ శిష్యుడు వచ్చివెళ్ళాడా?' అంటే వచ్చాడనే చెప్పింది వినీల. తను ఆ ప్రశ్న అడిగినా వినీలకు తట్టలేదంటే ఆశ్చర్యమే మరి!

—ఆ—వినీలకు అతని గురించి పూర్తిగా తెలీను. దానికి కారణమూ తనే! ఆ రోజున జేబుకొట్టేస్తోంటే చూసికూడా, పోనీలే, మనిషికి మరో అవకాశం యివ్వకపోవటం అన్యాయమనే ధ్యాసతో, అతనంటే ఏదో సాఫ్ట్‌కార్నర్‌లో ఊరుకొంటే....

చాలు—మనిషినిబట్టి అభిప్రాయాలు మార్చుకోవాలి.

కొందరికి ఈ సాఫ్ట్‌కార్నర్స్ పనికిరావు. మర్యాదగా ఇవ్వక పోతే, పోలీసులకు రిపోర్టు యిస్తేసరి—

దండం దశగుణభవేత్—అనేది నిజం!

—వారిజ నిర్ణయించుకొని, అగ్గిమీద గుగ్గిలంలాగ —వినీల యింట్లోంచి బయల్దేరింది.

మనోహర్‌ను కలుసుకొనేసరికి వారిజకోపం రెండింత

లయింది—ఎందుకంత తలపొగరు? అనుకొంది వారిజ.

మనోహర్‌ను అడిగిన మొదటి ప్రశ్న—"వినీలదగ్గర డబ్బు ఏంచేశారు?"

మనోహర్ ఉలిక్కిపడ్డాడు—"డబ్బా?—ఓ, అదా?" అంటూ లేచి జేబులోంచి నోట్లు లెక్కపెట్టి తెచ్చియిచ్చాడు.

"ఇవికావు—మీరు కొట్టేసిన వందరూపాయలనోటు సంగతి నేను అడిగేది."

మనోహర్ ముఖం నల్లగా మాడిపోయింది.

"చెప్పండి, అలా అయిపోయారేం? నాకు తెలిసిపోయిందనా?"

మనోహర్ నవ్వాడు "మీరు అంటున్నది నాకు తెలీడంలేదు."

"అయితే సరిగా చెబుతాను, వినండి, మీరు ఈ రోజు వినీల దగ్గర్నుంచి డబ్బు తెచ్చారా?"

"ఆవిడ ఇచ్చారు!"

"అదికాదు పోనీ, తేవడానికి వెళ్ళారా?"

"అవును!"

"అపుడే. ఆవిడ మీకు యిచ్చినదే కాకుండా, ఓ అంతట మీరు తెచ్చిన ఆ వందరూపాయల సంగతి ఏమిటని అడుగుతున్నాను!"

"ఆవిడ దగ్గర వందరూపాయలు పోయాయా?"

"పోవటానికి వాటికి కాళ్ళులేవు. మీరు తెచ్చిన సంగతి చెప్పరేం?"

మనోహర్ ఏమీ అనలేదు.

"ఏమీ అనరేం?"

"ఆవిడ డబ్బుపోయిందన్న సంగతి నాకు యింతవరకూ తెలీదు."

"పోనీండి, ఆ డబ్బు పొరబాటున మీకు చేరిందేమో చూస్తారా?" వేళాకోళంగా అంది వారిజ.

మనోహర్ ముఖాన కత్తివాటుకు నెత్తురు లేదు. అయినా తమాయించుకొంటూ అన్నాడు—"నిజం చెబితే నమ్మకపోతే నేను

ఏమీ చేయలేను."

"దయచేసి మీరు నిజం చెప్పకండి! ఆ డబ్బుమాత్రం తిరిగి ఇచ్చేస్తే అదే పదివేలు!—మీకు తెలీదు, విన్ను ఎంతటి సాధు జంతువో! అన్నంపెట్టే చేతినికాదండీ కొట్టాల్సింది, అందరిజేబులూ కొట్టేసిన చేతికి, ఆమాత్రం నీతి ఏముంటుంది?"

మనోహర్ ఏమీ అనలేదు.

"మీరు ఆవిడదగ్గర తీసుకొన్న మిగతా డబ్బు సంగతి ఏమో గానీ, ఈ వందరూపాయలు తిరిగి యిచ్చేస్తే, మీకూ మాకూ రాంరాం అని చెప్పి పోవటానికి వచ్చాను!"

"వినీలగారే పంపించారా మిమ్మల్ని?"

"అవును!" అంది వారిజ కఠినంగా. "నేను మీ సంగతి స్పష్టంగా చెప్పాను. ఈ డబ్బులు ఇచ్చేస్తే, అంతే చాలు!!"

మనోహర్ లేచాడు. "పదండి!" అన్నాడు.

"ఎక్కడికి?"

"పదండి, మీ వినీలగారి దగ్గరకే!—వారిజగారూ, నేను ఒకప్పటి దొంగనే. కానీ జీవితాంతం అంతే అనుకొనే మీ మన స్తత్వానికీ, నా జీవితానికీ పొత్తు ఏమిటి? చెయ్యలేదనే నిజం చెబు తోంటే నమ్మని మీకు చేశానని ఒక అబద్ధం నేను చెప్పటం చాలు! అది నావల్లకాదు!—పదండి. మీ వినీలగారి దగ్గరే ఈ విషయం తేల్చేసుకోవటం మంచిది. ఇలా జీవితాంతమూ నన్ను అనుమానించు కోవటంకన్నా అవమానం యింకోటి ఏముంది నాకు?"

—వారిజ ఆశ్చర్యపోయింది. నిజంగానే ఇతను తీయలేదా ఏంఖర్మ!

అతను ఈ నిముషంలో చెప్పేది నిజంగానే ఉన్నట్లు అని పిస్తోంది. కానీ, నమ్మబుద్ధికావటంలేదు.

మరి, ఆ వందరూపాయలు ఏమైనట్లు?

పోనీ, ఇంకోసారి వినీల ఇంటికి వెళ్ళొస్తే....?

—మనోహర్‌తోబాటుగా కదిలింది వారిజ కూడానూ. ఇద్దరూ వినీల ఇంటికి చేరి తలుపు తట్టేసరికి నవ్వుతూ, ఆశ్చర్యపోతూ

వినీలరేఖ తలుపు తీసింది.

"ఇదేమిటి, మీ ఇద్దరూ—ఇలా...."

వారిజ నవ్వింది. ఏమీ లేదన్నట్లుగా.

"రండి—" అంటూ వాళ్ళను ఆహ్వానిస్తూ అంది వినీల— "వారిజా—నీతో పోయిందని చెప్పానే. ఆ నోటు ఉందే—పొరబాటున పుస్తకంలో పెట్టానన్నది మర్చిపోయాను."

వారిజ ఆశ్చర్యపోయింది. మనోహర్‌కేసి చూపింది. మనోహర్ ఎటో చూస్తూ వుండిపోయాడు. అందుకే అతని మనసులో ఏముందో అన్నది వారిజకు తెలీనేలేదు.

ఓ గంట తర్వాత—మనసుపెట్టి మాట్లాడక వారిజ, తప్పులేకపోయినా గిల్టీగా ఫీలవుతూ మనోహర్ ఏదో కాలం గడిపాక, మనోహర్ వెడతానని చెబుతోంటే తనూ వెళ్తొస్తానని మనోహర్‌తోటే కదిలింది వారిజ.

వినీల ఆశ్చర్యంగా—ఎంత ఆశ్చర్యంతో ఇద్దర్నీ ఆహ్వానించిందో, అంతే ఆశ్చర్యంతో వీడ్కోలు చెప్పింది.

## 11

"అయాం సారీ అన్నాను గదా!"

"మీరు ఇంతక్రితం చాలా అన్నారు. ఇపుడు ఇది! అనడం మీహక్కు. కాదనటానికి నాకు హక్కులేదు, ఆ అర్హతాలేదు."

"క్షమించండి. మిమ్మల్ని బాగా నొప్పించానులా వుంది. నా పరిస్థితిలో మీరు ఉండివున్నా. అలాగే ప్రవర్తించేవారు."

"అవునేమో! తప్పుచేసినవాడు కనపడగానే, ఇంకో రాయి వెయ్యడం అనేది మనకు అలవాటు."

వారిజ ఏమీ అనలేదు. మనోహర్ మనసు బాగా గాయపడిందని ఆమెకు తెలుస్తోనే వుంది. మౌనంగా నడుస్తూవుండిపోయింది.

"ఈరోజు ఎవరి ముఖం చూశానో నాజీవితం అదృష్టవశాత్తూ వెనక్కుతిరిగి పోలేదు. లేకపోతే....ఆవిడ ఆ డబ్బు కనబడిందని చెప్పింది కాబట్టి బతికిపోయాను. లేకపోతే, నేను చేయకపోయినా-చేయని తప్పుకు శిక్ష అయిపోయేది ఇది!"

"క్షమించమని అడిగినా ఇంకా అదే విషయం అంటే ఏమ నాలి? పొరబాటు అనేది సహజం ఎవరికైనా. కాని పొరబాటు అన్న ప్పుడు సరిదిద్దుకునే అవకాశం కోరితే ఇవ్వటం న్యాయం—మీకు. మీకు ఈ విషయం చెప్పనక్కరలేదు!" వారిజ కావాలనే అంది ఆ మాట.

మనోహర్ వెంటనే అన్నాడు—"నిజం! నేను చెప్పేది అదే! తప్పుచేయలేదన్నా కానీ వినక తప్పు నామీద నెట్టివేయటం కూడా ఇలాటిదే! పోనీండి. మీకూ ఆ బాధ అనేది ఏమిటో తెలియ జేయా లని చేసిందే తప్ప, ఇందులో ఏమీలేదు. నేను—నిజం చెప్పా లంటే—ఇలాటి అవమానాలకు అలవాటు పడిపోయాను. గానీ— దగ్గర అనుకుంటున్న మీలాటి వాళ్ళదగ్గరకూడా ఇలాటి అవమానాలు ఎదుర్కోటం బాధాకరంగానే వుంటుంది."

వారిజ నెమ్మదిగా అంది—"నిప్పులో పడితేనేగానీ బంగారం అసలురంగు తెలీదట! అవకాశం వచ్చింది కనుకనే మీలోనిమార్పు స్పష్టంగా చూడగలిగాను!"

"అంటే ఇది శీల పరీక్ష ఏం ఖర్మ?"

వారిజ నవ్వేసింది—"ఏ పేరు పెట్టుకొన్నా సరేగానీ, పొర బాటుగా జరిగిన సంఘటన ఇది. కానీ—మీరు గారంటీగా మారి తీరతానని గట్టిగా చెప్పగలను నేను ఈరోజు!"

మనోహర్ నవ్వాడు.

"నవ్వుతారేం?" అనడిగింది వారిజ.

"క్షణం కింద దొంగ అనడానికీ, ఈక్షణంలో నేను జీవి తంలో ఎపుడు దొంగతనం చేయననీ చెప్పటానికీ కూడా మీకేచెల్లింది. ఆడవాళ్ళంటే రెండువక్కలా పదునున్న కత్తి అన్నది తెలిసింది నాకు. వాళ్ళ నాలిక ఎటుకావాలంటే అటు వీలుగా పలికే ఆయుధం అన్నదీ తెలిపిందినాకు!"

"మంచి రీసెర్చి చేశారు."

"అవకాశం ఇచ్చిన గైడ్ మీరేగదా!" మనోహర్ నవ్వాడు —"ఇంతకీ అగ్ని పరీక్షలో గెలిచినందుకు ఏమిస్తున్నారు?"

"గెలవటం ఏముంది ఇందులో?—అయినా గెలుస్తారని నాకు ముందే తెలుసు—నేను ఆమాట అనగానే మీ ముఖం చెప్పేసింది, మీరీపని చేయలేదని!"

"నిజం! మీకు ఫేస్‌రీడింగ్ తెలిసికూడా అపనింద వేశారన్న మాట!''

"అపనిందేగదా!—అయినా అడిగారు గదా, ఏదో ఓ బహుమానం ఇచ్చేతీరాలి మరి!—పదండి, ఆ హోటల్‌లోకి ..."

"ఇంతాజేసి ఓకప్పు కాఫీయా?"

"కప్పు కాఫీయో, కాఫీ హోటలో—మీకు కావాలంటే మీకు ఏంకావాలంటే అది తీసుకోండి. నిజాయితీ టెస్ట్‌లో గెలిచారు. మీకు ఏం ఇచ్చినా తప్పులేదు."

హోటల్‌లో కూర్చుంటూ అన్నాడు మనోహర్—"మీరు నాకు మాట ఇచ్చారు, ఏమడిగినా ఇవ్వాలిమరి!"

"ఇస్తానన్నాగా! అడగండి!!" వారిజ నవ్వుతూ అంది.

"అడగను. ఈవరం దాచుకుంటాను. జీవితంలో ఓరోజు మీ ముందుకువచ్చి, ఆరోజు కోరుకుంటాను ఈవరం-ఫర్వాలేదుగా"

"అయినా ఏమడగ గలరు నన్ను?—కొంపదీసి నన్ను...." ఆగిపోయింది వారిజ.

—మనోహర్‌కేసి పరీక్షగా చూసింది. అతనూ ఆమెకేసే చూస్తున్నాడు. అతను చెప్పని విషయాలు ఎన్నో అతనికళ్లు ఆమెకు చెబుతున్నాయి. ఆ కళ్ళలోని వెలుగు మరింత ఉజ్జ్వలంగా వెలుగుతోంది.

కళ్ళు దించుకుంటూ అన్నాడు మనోహర్—"చెప్పాగదా జీవితంలో నేనుబాగా ఎదిగాననుకొన్న రోజున మీ ముందునిలచి, అప్పుడు కోరుకుంటా ఈ వరాన్ని.''

వారిజ నవ్వేసింది—"ఆల్ రైట్! మీయిష్టం! కానీ సైకవరాలులాగ కొంప తీయవుగదా!"

"ఇవి కొంపతీసేవి కాక, కొంప కట్టేవి అయితే....?"మనోహర్ చిలిపిగా అడిగాడు.

వారిజ నవ్వుతూ అంది—"ఒప్పుకున్నాను. నేను మీముందు ఓడిపోయాను"

క్షణం ఆగి అన్నాడు మనోహర్—"అనుకొంటాం గానీ, ఓడిపోవడంలోకూడా ఎంత ఆనందం ఉంటుందో గదా!"

"అందరికీ ఓడిపోవడంలో లేదు. ఏ ఒక్కరికో...."వారిజ ఆగిపోయింది.

—ఇద్దరిమధ్యా క్షణం ఉన్నట్టుండి నిశ్శబ్దం.

—మాటలలో దాగుడు మూతలు ఆడుకుంటున్నాయి రెండు మనసులు. కళ్ళల్లో కోరికలు దోబూచులాడు కొంటున్నాయి.

వేరర్‌కు స్వీట్‌కు ఆర్డరిచ్చింది వారిజ.

స్వీటు తింటూ అంది నెమ్మదిగా—"మీరంటే వినీలకు ఎంతో ఆశగావుంది!"

మనోహర్ ఏమీ అనలేదు.

"ఏమీ అనరేం?"

"ఏమనను? వినీలగారి సంగతిసరే, నాకు తెలుసు. కానీ నా ఆశల సంగతి ఏమిటి?"

"అంటే?"

"వినీలగారు నాకుసాయం చేస్తున్నమాట కాదనను. కానీ అంతమాత్రంచేత ఆవిడ పట్లనాకు ఏవేవో ఆశలుంగటం అన్యాయం. అలాగే ఆవిడకూనూ! మా ఇద్దరిమధ్యా సంబంధం కేవలం ఆర్థిక పరంగానే!"

"అది మరింతగ గట్టిచేసుకోవాలనేది విన్నుకోరిక!"

"కావచ్చు, గానీ ఆవిడకు అలాటి కోరిక ఉండటంలో తప్పు కనిపిస్తోందో లేదో గానీ, నాకు సరిపడదు ఆకోరిక! యెందుకంటే, రేపు నా జీవితంలోకి ఆమె రావటం తటస్థిస్తే,నేను ఆమెకు క్షణక్షణం కృతజ్ఞతతో అణిగిమణిగి ఉండటమనేది నాకు కుదరదు! ఎందుకంటే జీవితం పంచుకోవటమనేది కృతజ్ఞతా భావంతోనే జరగాల్సిందిగాదు"

"కానీ ఆమెకు మీమీద నమ్మకం."

"ఉందనను. కానీ ఆ నమ్మకం ఎంతవరకూ ఉండాలి? నా

జీవితాన్ని నేను మార్చుకొంటాననే నమ్మకం ఆమెకు కలిగింది. ఆ నమ్మకం నాలోనూ కలిగించి నాకు ఆమె సాయమే చేసింది. కానీ, చెప్పా గదా-కృతజ్ఞతతో మెడలో తాళి కట్టటం అనేది జరగనిపని. పైపెచ్చు నేను చెయ్యలేనిపని అదే!—ఆవిడ కనిపిస్తే నాలో కృతజ్ఞతాభావం కలుగుతుందే కానీ, ఇంకోటికాదు. ఆవిడ ఇంత వరకూ ఈ సంగతి నాతో చెప్పలేదు. ఆ సంగతే అని ఉంటే, ఈపాటికి స్పష్టంగా చెప్పివుండి వాడిని!" మనోహర్ ఆగిపోయాడు. "ఏమిటలా చూస్తున్నారు?" అనడిగాడు తనను పరీక్షగా చూస్తున్న వారిజను.

"ఏంలేదు. మనం అంచనా వేసుకొనే మనిషికీ, నిజమైన మనిషికీ ఉండే తేడా ఎంతో కదా అని ఆలోచిస్తున్నా!"

"నేను చెప్పనా?—జేబులుకొట్టే మనోహర్, దెబ్బతిన్న మనోహర్, ఈరోజున మీముందు ఉపన్యాసం ఇస్తున్న మనోహర్-ఈ రెండుకాల వ్యక్తులకూ ఉన్న తేడా అంత!"

"నిజం!" అంది వారిజ.

కాఫీ అయిపోయాక హోటల్‌లోంచి బయటకు రాగానే అన్నాడు నవ్వుతూ మనోహర్—"తిట్టినంత తిట్టారు కానీ, ఇలా కోరినంత తినిపించి వదిలారు. అదే చాలు!!"

"మీరు బహుశా ఇంక మర్చిపోరు అనుకుంటా ఈరోజున జరిగిన సంఘటన! వారిజ అంటే బహుశా మీ కళ్ళలో ఓ సూర్య కాంతమో, ఓ ఛాయాదేవో కదలాడుతుంది కాబోలు!!"

"ఛీ—అలా అంటారేం? నా మనసులో మీ బొమ్మ సంగతి చెబితే, ఆశ్చర్యపోతారు మీరు."

వారిజ సిగ్గుపడింది—క్షణం ఆగి అంది—"వస్తామరి—ఆలస్యం అయిపోతోంది, ఇంటికి వెళ్ళాలి!"

"మంచిది. మళ్ళీ మీరు కలవాలంటే వినీలగారికి ఇంట్లో డబ్బులో, పర్సో పోవాలి కాబోలు!!"

వారిజ నవ్వింది—"అక్కర్లేదు. ఇదిగో, ఇది మా ఆఫీసు అడ్రసు. ఇది మా ఆఫీసు ఫోన్ నంబర్. ఎప్పుడు కావాలంటే

అపుడు రండి. ఎపుడంటే అపుడు ఫోన్ చేయండి."

"నాసంగతి మీకు సరిగా తెలీదు. మీ అడ్రసు ఇచ్చారంటే ఇంక అంతే సంగతులు!!"

"పర్వాలేదు—" నవ్వుతూ సెలవు తీసుకొంది వారిజ.

—ముందుకు నడిచిన మనోహర్‌కు ఏదో వెలితి స్పష్టంగా కనిపిస్తోంది. ఆ వెలితి ఏమిటా అని ఆలోచిస్తూ అడుగులు వేశాడు.

## 12

ఆ ఇంటిముందు కొచ్చి నిలబడ్డాడు మనోహర్. అడ్రసు మరోసారి సరిచూసుకొన్నాడు. ఇంటినెంబరు అదే—వారిజ రాసి ఇచ్చిన బోగన్‌విల్లా మొక్కలూ ఉన్నాయి.

మెట్లు ఎక్కి నిలబడ్డాడు. తలుపు కొట్టటమా? లేకపోతే ఎవరైనా వచ్చేంతవరకూ ఆగటమా? అని ఆలోచించాడు. అక్కడ అలా నిలబడివుంటే, ఎవరైనా చూస్తే బాగుండదేమోననీ ఆలోచించాడు. అయినా తలుపు కొట్టక, అక్కడే ఉండిపోయాడు.

క్షణం తర్వాత, ఎవరో కుర్రాడు పరిగెట్టుకొంటూ ఇంట్లోకి పోబోతోంటే ఆపాడు. "బాబూ—వారిజగారని...."

ఆ అబ్బాయి ఆగాడు—"మా అక్కా?"

"వారిజ అని...."

"మా అక్కే!"

"కొంచెం ఆవిడను పిలుస్తావా?"

"మీ పేరేమిటి?"

"మనోహర్—వెళ్ళి చెబుతావా?"

—ఆ అబ్బాయి క్షణం ఆగాడు. మళ్ళీ అన్నాడు—"మా అన్నయ్యకు చెబుతాను."

మనోహర్ ఉలికిపడ్డాడు—"అన్నయ్యకు కాదు. మీ అక్కకు చెప్పు."

ఆ అబ్బాయి ఏమీ అనలేదు. మౌనంగా ముందుకు వెళ్ళి పోయాడు—మనోహర్ పని మళ్ళీ మొదటి కొచ్చింది.

మళ్ళీ కొంతసేపటికి ఇంకో అబ్బాయి వచ్చాడు. ఈసారి

ఇంట్లోంచి.

"ఎవరు కావాలి?"

"వారిజ!"

"ఏంపని?"

—మనోహర్ అతనికేసి చూశాడు. ఏంపని?—ఏమో! అది తనకే తెలీదు. ఇతనికేం చెబుతాడు?

ఊరుకొండిపోయాడు.

"ఆఫీసుపనా? పర్సనలా?" మళ్ళీ అడిగాడు.

పర్సనల్ అంటే ఇబ్బంది అనుకొని, "ఆఫీసు పని" అని చెప్పాడు మనోహర్.

"అయితే ఆఫీసులో కలవండి."

"చూడండి....వారిజగారికి మనోహర్ వచ్చాడని చెప్పండి. ఆవిడ ఏంచెబితే అది చెప్పండి."

ఆ అబ్బాయి ఏమనుకొన్నాడో గానీ, మౌనంగా లోపలికి వెళ్ళాడు. వెంటనే తిరిగివచ్చి చెప్పాడు—"ఉండండి, అక్కయ్య వస్తోంది!" అని చెబుతూ వీధిలోకి వెళ్ళిపోయాడు.

అయిదారు నిమిషాల తర్వాత వారిజ వచ్చింది "హలో" అంటూ.

మనోహర్ నవ్వాడు—"ఇందిరాగాంధీగారితో ఇంటర్వ్యూ సంపాదించటం ఇంకా తేలిక అనుకొంటాను."

వారిజ నవ్వేసింది. "క్షణం ఆగండి. బయటకుపోదాం!"—

"ఇంతసేపు ఆగాను. ఇంకోక్షణంలో తొందర ఏముంది? కానీండి. కానీ నేను ఇక్కడ ఉన్నానని గుర్తుపెట్టుకోండి, చాలు!"

వారిజ లోపలికి వెళ్ళింది. అయిదారు నిమిషాల తర్వాత బయటకొస్తూ అంది—"పదండి, పోదాం!"

మెట్లుదిగి నడవటం ప్రారంభించారు. పది పదిహేను అడుగులు వేశాక అంది వారిజ: "మనల్ని వినీల చూస్తే....?"

"ఏం?"

"బాగుండదేమో నని....అంతే!"

మనోహర్ నెమ్మదిగా అన్నాడు—"మీరు తమాషా వ్యక్తు లండీ బాబూ! వినీలగారొకవేళ మనల్ని చూశారనుకోండి, కొంప మునిగిపోతుందా ఏం?"

"ఏమైనా అనుకొంటుందేమోనని!"

"అనుకొనే వ్యక్తులైతే ఏమైనా అనుకొంటారు. అయినా, మనం ఇంకోళ్ళకు భయపడుతూ ఎంతకాలం ఏపని చెయ్యగలం చెప్పండి!"

వారిజ నవ్వింది—"మీరు మొండి. అర్థం చేసుకోరు!"

"నిజమే. పోనీ అర్థంచేసుకొనేలాగున చెప్పండి!"

వారిజ నెమ్మదిగా అంది—"మాంసం తింటున్నామని ఎము కలు మెడలో వేసుకోవటం దేనికి? నేను మీతో ఇలా తిరుగుతున్నా నని పదిమందికి తెలిస్తే ఏం బాగుంటుంది? పోనీ, ఏ కాఫీ హోట ల్లోనో, లేకపోతే ఏ సినిమాకో వెడదాం!"

మనోహర్ నవ్వాడు—"బాగుంది. వీధిలోకన్నా హోటలో, టాకీసో పర్వాలేదన్నమాట. అయినా అడిగారు, పదండి. సినిమాకే వెడదాం!"

టాకీసు లోపలికి వచ్చారు. పక్క పక్కన కూర్చున్నాక నెమ్మదిగా అంది వారిజ—"వినీలకు అన్యాయం చేస్తున్నానేమో ననిపిస్తోంది."

మనోహర్ నెమ్మదిగా అన్నాడు—"ఇది దారుణం! పక్కన నేను కూర్చుంటే వినీలగురించి ఆలోచించటం!"

"చెప్పాగదా—వినీల నాకు మంచి స్నేహితురాలు. దానికి అన్యాయం చేయటం అంటే...." వారిజను ఆపుతూ అన్నాను— "అన్యాయం ఏమిటి? నేను మీకు ఇంతక్రితమే చెప్పాను, నేను ఆవిడను చేసుకొనేది లేదని. ఇక మీ సంగతి అంటే, మీ ఇష్టం."

"మీతో మాట్లాడటం కష్టం బాబూ!"

"కావచ్చు!"

"కావచ్చు కాదు, ఔను!"

మనోహర్ నవ్వేశాడు.

సినిమా జోరుగా నడుస్తోంది. హీరోగారి కల్లోకి హీరోయిన్‌తో బాటుగా ఓ డజనుమంది చెలికత్తెలూ వచ్చారు. హీరో దెబ్బతో ఇబ్బందిలో పడ్డాడు, ఎవర్ని ఎంచుకోవటమానని! అందుకే అందరికీ చెట్లచాటు దాగుడు మూతల పందెం పెట్టాడు—ఇంక ఒకటే పరుగు—ఆ చెట్టు వెనుకనుంచి ఈ చెట్టుకు· ఈ చెట్టు చాటునుంచి ఆ చెట్టు వెనక్కు....

వారిజ ఇబ్బందిగా "అది—వెధవ సినిమా—ఓ మగాడు అంటే ఇంత పడి చావాలా ఏం?"

మనోహర్ నవ్వాడు—"అది ఆ పరిస్థితినిబట్టి ఉంటుంది।"

వారిజ మనోహర్‌ను చూసింది, అదోలా.

మనోహర్ నెమ్మదిగా వారిజ చేతిని, తన చేతిలోని తీసుకొంటూ అన్నాడు—"వారిజా—నాకు రెండు కోరికలు ఇచ్చావు. గుర్తుందా?"

నవ్వుతూ అంది వారిజ—"కైకవరాలా?"

"అవే। కోరుకోనా?"

—మనోహర్ చేతిలోవున్న తన చేయిద్వారా, తన మనసంతా ఎక్కడికో ప్రయాణం చేస్తున్న సంగతి ఆమెకు తెలుస్తూనే వుంది. శరీరం అంతా గాలిలో తేలిపోతున్నట్లుగా, మనసు మయూరంలా నాట్యం చేస్తున్నట్లుగా....

"ఊఁ—" అంది వారిజ, తన్ను తాను అదుపులోకి తెచ్చుకొంటూ.

"ఇలా వచ్చిన నువ్వు, నా జీవితంలో ఎప్పటికీ ఉండిపో।"

"మొదటికోరిక అయిపోయింది" నవ్వుతూ అంది వారిజ.

"తీర్చే సంగతి చెప్పవేం?"

మనోహర్ ప్రశ్నకు జవాబు చెప్పటంలో ఇబ్బంది పడింది వారిజ. ఏంచెబుతుంది తను? ఏంచెబుతుంది??

—జీవితంలో ఓ అవకాశం వచ్చి తలుపు తడుతోంది. తియ్యాలా, వద్దా?

తీసి, జీవితాన్ని మధువనం చేసుకోవటమా? కానీ, మనోహర్

జీవితంలోని గతం కొంచెం ఇబ్బంది కరమైనది.

కానీ, అతను మారిపోయిన మనిషి!

—అలాకాక, తలుపుతీయక....వద్దు, ఆ ఆలోచనవద్దు!— మధ్య తరగతి జీవితంలో ఇలాటి అవకాశాలు రావు. బండెడు సంసారపు బాధ్యతతో, తండ్రి తన వివాహం సంగతి పట్టించుకోడు. తను తెచ్చే జీతం డబ్బుకోసం ఎప్పుడూ ఎదురుచూసే మనిషికి, తన్ను, తనతోబాటుగా తన జీతాన్ని త్యాగంచేసే ధైర్యం, సాహసం ఉండదు.

—తను పెళ్ళిచేసుకొని వెళ్ళిపోతే....తండ్రికి ఆర్థికంగా అండ పోతుంది. అయినా తను పెళ్ళిచేసుకోవటం, తన మేలు కోరుకోవటమే!

తనకుమాలిన ధర్మం ఎక్కడా లేదు.

ఇదీ అంతే!

—తన జీవితం తను దిద్దుకోవాలే తప్ప, ఇంకొర్ని అడిగి ....ఇది కుదరనిపని!

—వచ్చిన అవకాశం వదులుకోవటం జరిగితే....

వద్దు, తను ఈ అవకాశం వదులుకోదు-వారిజ నిశ్చయించుకొంది.

"నా ప్రశ్న ప్రశ్నలాగే వుండిపోయింది" మనోహర్ మళ్ళీ అన్నాడు.

వారిజ క్షణం ఆగి అంది—"ప్రశ్న పెద్దది."

"నిజమే, జీవితమంత పెద్దది."

"అదే ఆలోచిస్తున్నాను" అంటూ నెమ్మదిగా అంది వారిజ "పదండి, పోదాం. ఇంక సినిమామీద ధ్యాసపోయింది."

"పోనీ, మా రూంకు వెడదామా?"

"దూరమా?" అంది వారిజ.

"ఊహూ—దగ్గరే!"

"ఎవరైనా వుంటారా?"

"ఊహూ—ఉండరు" అన్నాడు మనోహర్.

"పదండి"—వారిజ లేచింది—పీటలమీద పెళ్ళి ఆగిపోయిం దని. సినిమాలో హీరో తన చొక్కా ఒకటే నలుపుకొంటున్నాడు. ప్రేక్షకులందరూ దిగాలుపడి సినిమా చూస్తున్నారు.

రూం తాళం తీస్తూ అన్నాడు మనోహర్—"మీరు ఇక్క డికి రావటం ఇది మొదటిసారి!"

"గుర్తు పెట్టుకొంటాను, ఈరోజును!" అంది వారిజ చిలి పిగా అతన్ని చూస్తూ.

మనోహర్ తలుపుతీశాడు. ఇద్దరూ లోపలికి నడిచారు. మనోహర్ తలుపు దగ్గరగా వేశాడు ఎవరైనాచూస్తే బాగుండ దంటూ.

## 13

"సినిమాలు బోరు కొట్టేస్తున్నాయి బాబూ!" అంది వారిజ కుర్చీలో వెనక్కు వాలుతూ.

నవ్వుకొంటూ, వారిజవేపుకు వంగి అన్నాడు మనోహర్— "చెప్పు, పోదామా?"

"ఎక్కడికి?"

"ఎక్కడికి ఏమిటి? తెలీనట్లుగా అడుగుతున్నావేం?"

"రూంకా?"

"ఊను."

"వస్తాను కానీ... " ఆగిపోయింది వారిజ.

"నీ షరతు నాకు తెలీందు కాదు. నీ యిష్టానికి వ్యతిరేకంగా నీమీద ఈగకూడా వాలదు. సరేనా?"

"ఈగ సంగతికాదు. ఈ రాక్షసుడి సంగతి ఏమిటి? దోపిడీ చేస్తే ...?"

"నీకు ఇష్టంలేదంటే నేనెప్పుడైనా ఏపనైనా చెయ్యగలననే నీ ఊహా?" అన్నాడు మనోహర్.

—వారిజ ఏమీ అనలేదు. తెరమీద హీరో, హీరోయిన్ని అమితంగా ప్రేమిస్తున్నట్లు చెబుతూనే వున్నాడు. 'నీకోసం ఏం చేయమంటావో చెప్పు' అంటున్న హీరోని 'ఏం అడగాలా' అని

ఆలోచిస్తున్న హీరోయిన్. 'పాట పాడమంటుందో ఏమో! ఖర్మ!' అనుకొంది మనసులో.

ఉన్నట్లుండి అంది వారిజ—"పోదాం. పదండి!"

మనోహర్ లేచాడు. థియేటర్‌లోంచి నెమ్మదిగా, సినిమా చీకటిలోంచి మంచి వెలుగులోకి—వచ్చారు.

బయటకొస్తోంటే గేటుదగ్గర పాస్ ఇవ్వబోయాడు—"వద్దు, మేం మళ్ళీరాం!" అంటూ ముందుకు నడిచాడు మనోహర్.

థియేటర్ బయటకు రాగానే ఆటో ఎక్కారు.

"తెలుగు సినిమా అంటే తలనొప్పిలా తయారయిపోయింది!" అంది వారిజ.

"నెపం సినిమామీదేకానీ, నీ ఊహ అదికాదు!" అన్నాడు మనోహర్.

కోపం ప్రకటిస్తూ అంది వారిజ—"నీ రూంకు పోదాంపద అనడానికి నాకు భయమా, ఏం? ఇలా సినిమా పేరు చెప్పి చివర్న సినిమా బాగులేదని, నీ రూంకు పోదామనేంత పిరికిదాన్ని కాను!"

"ఆ సంగతి నాకు తెలుసు!

"నా గురించి తెలిసీ యిలా అంటే అంతకన్నా అన్యాయం ఇంకోటి ఉండదు" అంది వారిజ. "నిజంగానే తలనొప్పిగా వుంది."

"ఇంటికి వెళ్ళగానే టీ తాగుదువు కానిలే!" అన్నాడు మనోహర్" ఈ రోజు సినిమా ప్రోగ్రాం వుందికదానని పాలు కొని పెట్టాను."

మెచ్చుకోలుగా చూస్తూ అంది—"అదీ సంగతి! అందుకని ఈ సినిమాకు తెచ్చావన్నమాట! అయినా....ఫర్వాలేదు. బండి గాడి లోనే పడిపోయిందన్న మాట!"

—ఆటో మలుపు తిరుగుతూ ముందుకుపోతోంది. మలుపు తిరుగుతున్నప్పుడు, కావాలని మనోహర్ వారిజవైపుగా వంగాడు. "ఊ—" అంది వారిజ వారిస్తున్నట్లుగా.

ఉన్నట్లుండి అంది వారిజ—"నాకింకా ఆశ్చర్యంగానే ఉంది. నేను యిలా ఎలా అయ్యానా అని!"

"అంటే?"—

"ఇంతగా ఎలా నీ వల్లో పడిపోయానా అని! నువ్వు దొంగ వని తెలుసు. దోపిడీదారువనీ తెలుసు. అయినా సరే. ఏమిటో.... ఆ వ్యామోహం అలాటిది!"—

"పశ్చాత్తాప పడుతున్నావా ఏం?"

"పశ్చాత్తాపమా? బహుశా మూడు ముళ్ళుపడ్డాక, అది నీ వాటాకు వస్తుందేమో!"

"చూస్తూవుండు, ఆలుమగలు కష్టసుఖాలు పంచుకోవాలట— కష్టాలు నీవి, సుఖాలు నావి!" మనోహర్ అన్నది విని హాయిగా నవ్వింది వారిజ.

"ఇప్పటికిది మూడోసారి. ఇంక ఈ సంవత్సరానికి వీలు పడదు" అంది వారిజ.

"అదేం?"

"కాజువల్ లీవులన్నీ నీకోసమే ఖర్చుపెడితే ఎలాగ! ఇంట్లో పనికోసం కొన్ని అట్టేపెట్టుకోవాలి. పైపెచ్చు ఇంకా ఆరు నెలకు పైగా ముందు ఉండనేవుంది."

"సర్లేద్దూ, ఎప్పుడు లీవు అయిపోతోందనే ఏడుపే!" అన్నాడు మనోహర్ కొంచెం సీరసంగా.

"మనోహర్—లీవుగురించి కాదు నా వర్రీ! క్యాజువల్ లీవు అయిపోతే, ఎర్న్‌డ్ లీవు. ఆ లీవు అయిపోతే హాఫ్ పే లీవు, అదీ అయిపోతే ఎక్స్ట్రా ఆర్డినరీ లీవు...."

"చిట్టచివర్న మెటర్నటీ...."

"నా భయమూ అదే! దగ్గర చేరితే బాగానే ఉంటుంది కానీ, రేపు ఎలాటి జీవితం ఎదురు కాబోతుందో అనే భయం మాత్రం వెంటాడుతునే వుంటుంది. నీకేం—నువ్వు మగవాడివి, ప్రకృతి వేసే ఆంక్షలన్నీ ఆడజనాభాకే గదా!—"

మనోహర్ నవ్వుతూ అన్నాడు—"సర్లే. రూం దగ్గరకు వస్తోంది. నీ ఈ ఉపన్యాసం రూంలోకి వెళ్ళాక ముగిద్దువుగాని!"

ఆటో ఆగాక, దిగి, రూంలోకి వెళ్ళబోతూ అంది-

"మనోహర్—నాకు నీ మీద నమ్మకం లేకపోవడమూ కాదు. నువ్వు వదిలేసినా జీవితం గడుపుకోగలిగే ధైర్యం లేకపోయీ కాదు—కానీ....ఏదో భయం!"

మనోహర్ నవ్వేశాడు.

"వారిజా. ఒక్క సంగతి చెప్పనీ నన్ను—నేను చిన్న చిన్న నేరాలు చేసినమాట నిజమే. కాదనను! జేబులు కొట్టేయటం, బ్లాక్‌లో టిక్కెట్లు అమ్మటం ఇవన్నీ చిన్న నేరాలు. ఇవి చేసిన నేను ఇంకో మనిషిని కొంచెం అన్యాయం చేస్తున్న మాట నిజమే కానీ. నువ్వు అనుకునేంత నేరం చేయగలగటం అన్నది మాత్రం అబద్ధం!"

"చిన్నచిన్న నేరాలు పెద్దనేరాలకు మెట్లేమో!—" అంది వారిజ చిన్నగా నవ్వుతూ.

"ఇప్పుడు నేనెక్కే మెట్లకు గమ్యం వారిజ! ఆ వారిజ మంచిదైతే. నా జీవితం మంచిదే అవుతుంది!" అన్నాడు మనోహర్.

—వారిజ చేతిలోని హాండ్‌బాగ్ పక్కమీద పడేసింది. చుట్టూ చూస్తే రూంలో అంతా తన ఎత్తున దుమ్ము కనబడింది. మూలనున్న చీపురు అందుకొని నెమ్మదిగా ఇల్లంతా తుడుస్తూ అంది— "ఇల్లు చూస్తోంటేనే తలనొప్పి పెరిగిపోతోంది."

"నువ్వు వస్తావుగదా, అని ఊరుకొన్నాను."

"నేను వచ్చేది ఇల్లు ఊడ్చిపోవడానికి అన్నమాట!"

"ఛ—నీ ఇల్లుకదా, నువ్వు చక్కపెట్టుకొంటావనే ఆశా, కోరికా! తప్పేం లేదుగా అందులో!"

"ఆడదంటే ఇల్లు ఊడ్చి ముగ్గుపెట్టే పనిమనిషి అనే భావం మాత్రం మీ మగవాళ్ళలోంచి పోనే పోదు!" అంది వారిజ.

"ఛీ—ఆడవాళ్ళని అంతకన్నా అధికంగా చూసినా, నొచ్చుకొనే జనాభాకూడా నాకు బాగా తెలుసు!"

"మాటకు మాటమాత్రం వచ్చింది!" వారిజ నవ్వుతూ అంది.

మనోహర్ నెమ్మదిగా వారిజ దగ్గరగా చేరి అన్నాడు—"నిజమే జీవితంలో ఇలాంటి సంఘటన వుంటుందని ఎవరైనా

ఎపుడైనా చెప్పవుంటే, నవ్వేసేవాడిని! కానీ ఈ రోజున ఇలాగ నువ్వు నా యింట్లో తిరగటం చూస్తోంటే, ఇది నిజమా, కలా అని అనిపిస్తూ వుంటుంది నాకు!"

మనోహర్ నెమ్మదిగా వారిజను దగ్గరగా తీసుకొన్నాడు. అలా దగ్గరకు తీసుకోవటంలో మనోహర్ కోరిక మనసులోంచి శరీరం ద్వారా క్రియారూపం పొందటం అనేది వారిజకు తెలుస్తూనే ఉంది.

ఆ కదలికకు, ఆ స్పర్శకు, ఆ కోరికకు తన్ను తాను బలి చేసుకోవాలనే కోరిక వారిజను కోసేయటం కూడా ఆమెకు తెలుస్తూనే వుంది.

అందుకే—

మనోహర్ నెమ్మది నెమ్మదిగా వారిజను శారీరకంగా ఆక్రమించుకొంటూంటే, ఆ అనుభూతి అణువణువునా నిండిపోతోంటే వారిజకూడా అతనికి సహకరించసాగింది.

# 14

"వెళ్ళి టీ కాచు, తాగుదాం?" అన్నాడు మనోహర్ మత్తుగా.

వారిజ ఏమీ అనలేదు. మరొకసారి మనోహర్‌కేసి ఆశగా మత్తుగా చూసింది. ఆ కళ్ళలో కోటి కోరికలు. ఆ కోరికల చాటున కొండంత తృప్తి కూడాను!!

"ఏయ్! ముద్దూ!—" అన్నాడు మనోహర్ వారిజను నెమ్మదిగా తడుతూ.

ఓసారి కళ్ళు ఎత్తిచూసి, నెమ్మదిగా మళ్ళీ మూసుకొంది వారిజ.

"వెళ్ళి టీ కాచమంటే వినవేం?" అన్నాడు మనోహర్—"టైంచూడు ఎంతయిందో. ఆ తర్వాత మళ్ళీ ఆలస్యం అయిపోయిందంటూ గొడవ పెట్టకు."

వారిజ నవ్వింది కళ్ళు తెరవకనే.

"నవ్వుతావేం?"

"ఏంలేదు. ఆలస్యం అయితే కొంప మునిగిపోతుందా ఏం?

మహా అయితే మా రాక్షసుడు ఇంకోసారి నామీద విరుచుకు పడతాడు అంతేగదా!"

"నువ్వు చెప్పేది నా సంగతా? మీ తమ్ముడి సంగతా?"

"ఇద్దరూ రాక్షసులే గానీ విరుచుకు పడటం వేర్వేరు రకాలు. నువ్వు నీదగ్గరకు రానందుకైతే, వాడు నీదగ్గరకు చేరినందుకు!"

మనోహర్ నవ్వాడు.

"అవును మరి, అంతగా భయపడుతూకూడా వస్తావేంమరి?"

"తమ్ముడికి భయపడటం అనేది లేదు. ఎటొచ్చీ వాడుచెప్పే నిజాలకు భయంవేస్తుంది. చుట్టూచూస్తోంటే కనబడే సంఘానికి భయంవేస్తుంది. ఇంక నీ దగ్గరకి రావటం అంటావ్—దానికి కారణంనీకు భయపడికాదు. నీదగ్గరకు రాకుండా ఉండటం నాకు చేతగాదు గనుక!"

మనోహర్ నవ్వాడు.

"వారిజా. నాకు ఏమనిపిస్తోందో చెప్పనా?"

"ఊ—"

"ఈ ఆడమగల మధ్యవున్న సంబంధం ఎవడు కనిపెట్టాడో గానీ వాడికో, వాళ్ళకో ప్రతీ ఏడాదీ ఓ నోబుల్‌పీస్ ప్రైజు ఇవ్వాలి అనిపిస్తోంది!"

"ప్రతీ ఏడాదీ దేనికి మళ్ళీ?"

"ప్రతీ ఏడాదీ అతనుచేసిన సేవకు! అతడు ఈమార్గం కనిపెట్టి వుండకపోతే ఎన్ని అనర్థాలు జరిగేవో గదా!"

"బాగుంది. ప్రపంచం అంతా అనర్థాలకు మూలకారణము ఆడది అంటూంటే. నువ్వు ఇలా అంటున్నావ్!" వారిజ నవ్వుతూ అంది.

"ప్రపంచంలో ఈమాత్రం శాంతి అయినా వుందంటే దానికి ఈ...."

"చాలుబాబూ, చాలు! ఇంతసేపూ ప్రాక్టికల్స్ అయ్యాయి. ఇపుడు థియరీయా ఏం?" అంది వారిజ నవ్వుతూ.

"అందుకే అంటున్నాను, లేచి...."

"లేస్తున్నా!—" అందేగాని వారిజ లేవలేదు. పక్కనేవున్న మనోహర్‌ను మరికాస్త దగ్గరకు లాక్కొంది—వెంటనే తనచర్య తనకే ఆశ్చర్యాన్ని కలుగచేసింది వారిజకు—ఎంతలా మారిపోయింది తను!!

"వారిజా—లైం ..."

"నీకెంతసేపూ టీ ధ్యాసేగాని, నాగురించి ఆలోచించనే ఆలోచించవన్నమాట!" లేస్తూ అంది వారిజ.

వారిజ బట్టలుకట్టుకుంటూంటే మెల్లిగా అన్నాడు మనోహర్. —"నువ్వలా అనుకొంటే ఏం చెప్పను? ఏ రోజుకు ఈ చదువు కొంచెం గట్టెక్కి, ఓ ఇంటివాడ్ని అవుతానా అని చూస్తున్నాను."

"ఇంటివాడ్ని కావాలనే అనుకొంటే, ఇంకా ఆలోచన ఎందుకు? అట్నుంచి నువ్వురెడీ, ఇట్నుంచి నేను...."

"నిజమే, గానీ వివాహం విద్య నాశాయ అన్నారుగదా!" నవ్వుతూ అన్నాడు మనోహర్.

"అందుకే కాబోలు, వివాహానికన్నా పూర్వమే శోభనం!"

—మనోహర్ నవ్వాడు. ఆనవ్వుతో శ్రుతి కలిపింది వారిజ.

వారిజ దగ్గరగా వెళ్ళాడు మనోహర్—"నువ్వు సరదాగానే అంటున్నా. నాకూ తెలుస్తూనే వుంది వారిజా. నీ అవసరం జీవితంలో ఎంతవుందో! ఇంకొంచెం కాలం ఆగితే...."

వారిజ ఏమీ అనలేదు. నెమ్మదిగా కదిలి స్టవ్‌దగ్గర కెళ్ళింది. అగ్గిపుల్ల గీసి, వత్తులకు అంటించింది. వత్తులు నెమ్మది నెమ్మదిగా అంటుకుంటున్నాయి.

"నువ్వు నా ఇంట్లో ఇలాగే కలకాలం...."

"వేళకు టీ కాస్తూ, వేళకు భోజనం వడ్డిస్తూ, వేళకు..."

"ఊ—ఊ....ఇంకా ఏమైనా....?"

"ఏమైనా యేమిటి, అన్నీనూ—ఒకటేమిటి, ఈ ప్రపంచంలో జరుగుతున్న అన్నిసౌకర్యాలూ మగవాడికి ఆడదేగదా అందించాల్సింది ఆఖరికి ఈ టీ దగ్గర్నుంచి...." నవ్వుతూ అంది వారిజ—"సర్లే చెప్పు. నీళ్ళు కాగుతున్నాయి. టీపొడి ఎక్కడ ఉందో—"

"అదిగో, ఆ డబ్బాలో...." అన్నాడు మనోహర్.

వారిజ లేచింది. అటకమీదున్న డబ్బాకోసం చేయిచాచింది.

అంతసేపూ వారిజ అందాన్ని దూరంనుంచే చూస్తూన్న అగ్ని శిఖ వున్నట్టుండి ఆమెకొంగు అందుకొంది. పైనుంచి డబ్బాను అందుకునే ఆలోచనలో వున్న వారిజ గమనించే లోపున ఆ అగ్ని శిఖలు ఆమెను చుట్టుముట్టాయి. పల్చని చీర కావడంతోను, త్వరగా మండే తత్వం ఉండడంతోనూ, మరింత త్వరగా ఆమె శరీరాన్ని చేరుకుంది.

ఒంటికి వేడి తగులుతోంటే, యేమిటోనని వెనుదిరిగింది వారిజ. అప్పటికే ఆతృతగా ఆమెను చుట్టుకుంటున్న మంటల్నిచూసి ఒక్కసారి కెవ్వుమంది.

# 15

హాస్పిటల్ ఆవరణంతా అదోరకమైన వాసనతో నిండివుంది.

ఎత్తైన వేపచెట్లనుంచి వచ్చేగాలితో, హాస్పిటల్లోని మందుల వాసన కలిపి కొత్తరకమైన వాసనయేదో ఆ ఆవరణను నిండివుంది.

మనోహర్ మనసంతా అల్లకల్లోలంగావుంది. యేం జరుగుతుందో, ఏమో—తన సంగతి ఫర్వాలేదు. కానీ వారిజ....

—తనకే తెలుస్తోంది—వారిజను పూర్తిగా అగ్నిదేవుడు కబళించి వేశాడు. వళ్ళంతా ఏదోవాసన. భరించలేని వాసన. సజీవంగా దహనం చేసినట్లుగా.

అయినా తప్పంతా తనది—సినిమానుంచి, ఇంటికితెచ్చి, ఇంట్లో టీకోసం అంతపోరు పెట్టకుండావుంటే....కానీ తనుమాత్రం యేం చేస్తాడు—ఎక్కడనుంచో కనరాని హస్తమేదో తన్ను అలా చేయమని నిర్దేశిస్తోంటే....టీ—ఎన్నిసార్లు తను కాచుకోలేదు! ఎపుడయినా ఇలా జరిగిందా??

—మనోహర్ ఆలోచనలన్నీ గజిబిజిగా వున్నాయి.

నర్సు బయటకొచ్చింది—"చూడండి. మిమ్మల్ని డాక్టర్ పిలుస్తున్నారు!"

మనోహర్ ముందుకు నడిచాడు.

డాక్టర్ తువ్వాలుతో చేయి తుడుచుకుంటూ వచ్చాడు—
"చూడండి...."

"నా పేరు మనోహర్!"

"మిస్టర్ మనోహర్—ఆవిడ విషయం చెప్పటం కష్టం. షి ఈజ్ సివియర్లీ బర్న్టెడ్. బతకటం తొంభయిశాతం అనుమానమే బతికినా...." డాక్టర్ ఆగిపోయాడు.

మనోహర్ ఏమీ అనలేదు—అనడానికి అతనికి ఏమీ లేక పోతుంది. జీవితంలోకి యెంతో నెమ్మదిగా వచ్చిన వసంతం, హఠాత్తుగా వెళ్ళిపోతోందనే చూస్తూ ఊర్కోవటమే తప్ప ఏమీ చేయలేక పోతున్నాడు.

"నేను పోలీసులకు ఫోన్ చేశాను. వాళ్ళు వస్తుంటారు. ఎటొచ్చీ ఏమైనా, స్టేట్మెంటు రికార్డు చేసుకుంటారు. అది మంచిది కదా!—మీరు ఇక్కడే వుండండి. వాళ్ళొచ్చే సమయానికి ఉంటే మంచిది. మీ మిసెస్‌కు కొంచెం ధైర్యం...."

"ఆమె నా మిసెస్ కాదు!—"

డాక్టర్ హఠాత్తుగా తలెత్తాడు, ఆశ్చర్యంతో.

"ఆమె మీ భార్య...."

"కాదు."

"మరి:"

"ఆమె నా స్నేహితురాలు."

"మరి, ప్రమాదం ఎక్కడ జరిగింది?"

"మా ఇంట్లోనే...."

"ఓ, ఐసీ .." అన్నాడు డాక్టరు ఏదో అర్థమైపోయినట్లుగా. వెంటనే అన్నాడు—"అయితే వాళ్ళ యింటివాళ్ళకు ఈ సంగతి తెలుసా?"

—మనోహర్ ఉలిక్కిపడ్డాడు. నిజమే—తను ఆ సంగతి వాళ్ళకు తెలియజెప్పనే లేదు. తనకా సంగతి తట్టనేలేదు.

"లేదు. చెప్పాలి!"

"వెంటనే ఆపని చెయ్యండి. అదర్వైజ్ ఇట్ మే బీ టూ

లేట్!"

—మనోహర్‌కు కళ్ళమ్మట నీళ్ళు తిరిగాయి. డాక్టరు చెప్పేది నిజం కావచ్చు, కానీ ఆ నిజం చెప్పటం అనేది ఎంత కఠోరంగా వుంది!

"నేను ఆమెతో మాట్లాడవచ్చా?"

"వెళ్ళండి. కానీ ఎక్కువగా ఆమెను డిస్టర్బ్ చెయ్యొద్దు ఎంత ఎక్కువ విశ్రాంతి ఉంటే, అంత మంచిది."

మనోహర్ ముందుకు నడిచాడు.

ముఖం తప్ప, తక్కిన భాగం అంతా దుప్పటితో కప్పేశారు. ముఖం కూడా నల్లగా, కమిలిపోయి, అదోలా వుంది.

మనోహర్ దగ్గగాచేరి "వారిజా" అన్నాడు.

ఆమె కళ్లు తెరిచింది. ఆ కళ్ళల్లో భయం. ఆ కళ్ళల్లో బాధ-అయినా ఆ కళ్ళల్లో వెలుగు, ఆ కళ్ళల్లో అభిమానం మాత్రం అక్కడే ఉన్నాయి.

"ఏం జరిగిపోయింది వారిజా!"

వారిజ నవ్వింది, చిన్నగా.

"ఎన్ని కలలు కన్నాం-అన్నీ ఇలా భస్మమైపోవటానికా?"

చిన్నగా కళ్ళు మూసుకొంది వారిజ-"ఎందుకలా జరిగింది—జీవితానికి ఆసరావి అనుకొంటే, ఆ ఆసరాకూడా ఇలా అర్ధాంతరంగా.... వారిజా...."

మనోహర్ కళ్ళు నీళ్ళు చిమ్ముతున్నాయి వారిజ ఏమీ అనటం లేదు. ఆమెకు తెలుసు, స్పష్టాతి స్పష్టంగా, తాను మరికొన్ని గంటల వ్యవధిలో ఈలోకం వదిలిపోతానని.

"అన్నట్లు, మీ ఇంటివాళ్ళకు తెలియజెప్పమన్నాడు డాక్టరు. వెళ్ళిరానా?"

నెమ్మదిగా అంది—"వద్దు. చివరక్షణాలు ఇవి. వదిలిపోవద్దు. నాకు భయం.... మా ఇంటి ఎదురింట్లో ఫోనుంది. ఫోన్ చేసి చెప్పండి. చాలు. మావాళ్ళు వస్తారు."

"వారిజా...."

"పర్వాలేదు. చెయ్యండి. వాళ్ళు మిమ్మల్ని ఏమీ అనరు."

"నన్నేమైనా అంటారనికాదు-ఇంత జాగ్రత్తగా ఇన్నేళ్ళు పెంచిన వాళ్ళకు, నిన్నిలా అప్పజెప్పటం...."

"ఛీ—వాళ్ళు మీకు అప్పజెప్పి ఉంటేగదా, ఇదంతా - ఫోన్ చెయ్యండి।"

మనోహర్ ముందుకు అడుగువేశాడు. వెంటనే వెనక్కు వస్తూ అన్నాడు— "అన్నట్లు పోలీసులకు తెలియచేశారు వీళ్ళు।"—

"రానీండి. నేను ఇంకా బతికే ఉన్నాగదా। మీమీద ఈగ కూడా వాలదు. సరేనా?"

—మనోహర్ దగ్గరగా వచ్చాడు. అతని కళ్ళనిన్నీ నీళ్ళు. ఏం చెప్పాలో, ఏం చేయాలో తెలీనిస్థితి.

"అసలు నా కోరికే, నిన్నిలా చేసింది గదా।"

"నా మనసులో కోరిక అది, మీరు పలికారు, పోనీండి. మీతో కొన్ని క్షణాలైనా ఉన్నాననే తృప్తి చాలు...."—వారిజ బాధగా కళ్ళు మూసుకొంది.

—మనోహర్ ఇంకేమీ అనలేదు. ముందుకు నడిచి, డాక్టర్ నడిగి, వారిజా వాళ్ళకు ఫోనులో జరిగింది క్లుప్తంగా చెప్పాడు. వాళ్ళు ఏమీ అనడానికి అవకాశం ఇవ్వక ఫోను పెట్టేశాడు. అలాగే వినీలరేఖకు కూడా ఫోన్ చేశాడు—క్షణం సంశయించి, 'వారిజ ఒళ్ళు కాలింది, హాస్పిటల్లో ఉంది. వెంటనే రమ్మ'ని చెప్పాడేకానీ, ఎక్కడ ఎలా జరిగిందో మాత్రం చెప్పలేదు.

ఫోన్ పెట్టేసరికి పోలీసులు రెడీ అయ్యారు. మనోహర్ వాళ్ళను చూసి ముందుకు నడిచి జరిగింది చెప్పాడు, క్లుప్తంగా.

## 16

మనోహర్ చెప్పింది విన్నాడు ఇనస్పెక్టర్. అంతా విన్నాక అన్నాడు— "ఇది మీరు చెప్పిన కథ. ఆవిడ చెప్పే స్టేట్‌మెంట్‌ను రికార్డు చేయించే ఏర్పాటు చేయాలి. ఈలోగా మీరు ఎక్కడికి వెళ్ళే ప్రయత్నం చేయద్దు."

—మనోహర్ సరేనన్నట్లుగా అక్కడే నిలబడ్డాడు.

డాక్టరు, ఇనస్పెక్టరు, వారిజ ఇచ్చే స్టేట్ మెంట్ రికార్డు చేసే ప్రయత్నంలో నిమగ్నమయారు.

వాళ్ళు లోపలికి వెళ్ళగానే మనోహర్ మనసంతా అల్లకల్లోల మయింది—జీవితం అంటే ఏమిటి? ఒక మలుపులోంచి మరో మలుపులోకి వెళ్ళటమేనా? లక్ష్యం అనేది లేకపోయినా ఏదో నడిచి పోవడమేనా?—లేకపోతే....లక్ష్యం తెలిసినా, అందుకోలేక విఫలాల మెట్లలో జారుతూ పోవడమేనా?

—తెలీదు.

జరుగుతున్న సంఘటనలకు ప్రత్యక్ష సాక్షిగా నిలబడటం తప్ప ఇంకేమీ తన పాత్రలేదు.

జీవితంలో వస్తున్న మార్పులతో నిర్లిప్తంగా రాజీపడటం తప్ప ఇంకేమీ తను చేయగలిగిందిలేదు.

జీవితానికి ఆది ఏమిటో, అంతమేమిటో తెలీకపోవటమే జీవితంలోని వైచిత్ర్యమేమో!!

—మనోహర్ ఆలోచనలన్నీ చిత్తుకాగితాలు తుఫానులో ఎగిరినట్లుగా కల్లోలమైపోయాయి.

—వినీలరేఖ ఆటోలోంచి దిగింది.

మనోహర్ దగ్గరకు రాగానే క్షణం ఆగి అడిగింది "ఎలా వుంది దానికి?"

మనోహర్ నెమ్మదిగా అన్నాడు "తెలీదు. లోపల స్టేట్ మెంట్ రికార్డు చేసుకొంటున్నారు."

వినీల అక్కడే ఆగిపోయింది.

—ఇద్దరి మధ్యా నిశ్శబ్దం. ఎన్నో విషయాలు మౌనంగా ఉండిపోయాయి.

నెమ్మదిగా అడిగింది—"ఎలా జరిగింది?"

మనోహర్ ఉలిక్కిపడ్డాడు—ఎలా జరిగిందో తనకే తెలుసు. ంగతి ఎలా చెప్పటం?

నెమ్మదిగా చెప్పటం మొదలుపెట్టాడు—తనకూ, వారిజకూ న్న ఆ పరిచయం, అనుబంధంగా తర్వాత శారీరక బంధంతో

ంధం

ఎలా పెరుగుతూ వచ్చిందో. అంతా చెప్పి చివర్న అన్నాడు—.
"....ఈ రోజు జరిగిన సంఘటన యిది. వాళ్ళ ఇంట్లో వాళ్ళనుంచి అందాల బొమ్మను తెచ్చాను. ఇలా...."అతన్ని బాధ ఏమీ చెప్పనివ్వ లేదు.

గొంతు అంతా పట్టి ఎవరో నొక్కి-వేస్తున్నట్లుగా వుంది. జరిగిపోయిన ప్రమాదం జరగాల్సిన భవిష్యత్తు బలవంతంగా ఆపినట్లుగా వుంది.

అంతా వింది వినీలరేఖ.

ఆమెలో చైతన్యమూ దాదాపుగా చచ్చిపోయింది. ఎన్ని కలలు కంది-ఏమనుకొని ఈ జీవితంతో పోరాటం ప్రారంభించింది?

ఒంటరి తనపు చీకటిలోంచి, తనంతతానుగా బయటకొచ్చి వెలుగులో నిలబడాలని చేపిన ప్రయత్నం ఇలా బూడిదలో పోసిన పన్నీరు అయిపోయింది.

—అంటే....వారిజ. తన స్నేహితురాలు — తనకన్నా ముందే అవకాశం పొందగలిగింది అన్నమాట! అదృష్టవంతురాలు. అదృష్టవంతురాల్ని చెరిపేవాడు వుండడు. దురదృష్టవంతురాలు తను-తన్ను బాగు చేసేవాడూ ఉండడు!!!

—జీవితం మళ్ళీ మొదలు.

ఎవరితోనో పంచుకోవాలనే కోరిక మళ్ళీ మొదటికన్నా అధికంగా ముందు నిలబడింది వినీలకు.

—ఏం కోరింది తను, ఏం సాధించగలిగింది తను.

కోరికకూ, సాధనకూ యింత దూరమా?

— తెలీదు.

నెమ్మదిగా అన్నాడు మనోహర్-"క్షమించండి, ఈ రోజున ఇలాటి పరిస్థితిలో మీకు ఈ విషయం చెప్పాల్సి వస్తుందనుకోలేదు నేను."

వినీలరేఖ నవ్వింది, పేలవంగా, అంతా కోల్పోయిన ఓడిపోయినట్లుగా వుంది ఆ చిరునవ్వు.

"....నేను, వారిజా కలిసివచ్చి మీకు ఈ సంగతి చె

అని అనుకొన్నామే కానీ, ఇలా...."

వినీలరేఖ నెమ్మదిగా అంది—"పోనీండి, ఏం జరిగిపోయింది గనుక? మీరు ఇద్దరూ కలిసివచ్చే వెబుదురు కాని!—"

పిచ్చివాడిలా చూశాడు మనోహర్ — "అంటే....మీకు తెలీదండీ, వారిజ పరిస్థితి....డాక్టరు దాదాపుగా చెప్పనే చెప్పాడు గదా!...."

"అది దాదాపుగానే కదా!—" అని ఆగి అంది—"పదండి డాక్టరువాళ్ళు బయటకొచ్చారు, లోపలికి వెళ్ళి వారిజనుచూపి వద్దాం!—"

ఇద్దరూ ఆత్రంగా నడిచారు లోపలికి.

లోపలికి వెళ్ళేసరికి వారిజ ముఖంలో బాధవున్నా తెచ్చి పెట్టుకొన్న నవ్వుతో వాళ్ళను పలుకరించింది.

వినీలరేఖ వారిజ దగ్గరగా నిలబడింది.

"వినూ—నీకన్నా ఒక్కడుగు ముందు వేశానే నేను! నీకు తెలీకుండా ఇలా వేసిన అడుగు ఎలా అయిందో చూశావా!..." బాధతో, ఆగుతూ అంది వారిజ—"చూడు, ఇలా ఇంక కొన్ని క్షణాలు మాత్రమే ఈ జీవితం! — నీకు పొరబాటున చేసిన అన్యాయం...."

వారిజను ఆపుతూ అంది వినీల—"ఊర్కో వారిజా— విశ్రాంతి తీసుకో!;—మళ్ళీ మాట్లాడదాం!—"

వారిజ నవ్వింది-"ఆయనతో ఏడడుగులు నడిచి, సంతోషంగా వుండాలనుకొన్నాను. కానీ, ఇలా విషాదం నా జీవితాన్ని చుట్టు ముట్టింది—బతికి బట్టకట్టటం కల్ల....అదే డాక్టరు చెప్పకపోయినా నాకు తెలుసు—" అంటూ మనోహర్‌కేసి చూపింది—"వాళ్ళ అనుమానం ఇది మర్డరేమోనని! గుచ్చిగుచ్చి అడిగారు నిజంగా ప్రమాదం అని చెప్పి, అలా రికార్డు చేయించాను—ఇంతకన్నా ఏమీ చేయలేకపోయాను...." వారిజలో ఆయాసం పెరిగి ంది.

వినీలరేఖ ఉలికిపడింది. వారిజ ముఖంలో కళలు మారటం

తెలుస్తూనేవుంది. పరుగుపరుగున బయటకొచ్చి, "నర్స్" అని కేకేసింది.

అయిదారు నిమిషాల తన పోరాటం తర్వాత మృత్యువువడిలో హాయిగా వాలిపోయింది వారిజ.

—మనోహర్‌లో చలనం పూర్తిగా ఆగిపోయింది.

వినీలరేఖ మౌనంగా తన స్నేహితురాలికి వీడ్కోలు చెబుతోంది, కన్నీళ్ళతో.

వారిజ కుటుంబసభ్యులంతా గోలుమంటూ తమకు జరిగిన అన్యాయాన్ని పంచభూతాలకు చాటిచెబుతున్నారు.

ఇనస్పెక్టర్ వారిజలో మిగిలిపోయిన ఆ 'శరీరాన్ని' వాళ్ళ కుటుంబానికి అప్పగించాడు. వాళ్ళ టాక్సీలో ఇంటికి కదిలారు.

విధి తనకు యిచ్చిన అవకాశాన్ని, మళ్ళీ తానే లాక్కుంటూ పోతే, ఏమీ చేతకాని వాడిలా చేష్టలుడిగి నిలబడ్డాడు. కలిసి బతకాలను కొన్న మనిషి, తనకన్నా ఎంతో ముందుకుపోయి, తానందుకోలేని చోటుచేరుకొని, తన కలలన్నీ కాల్చిపోతే....మనోహర్ కళ్ళల్లో నీళ్ళతో అలా నిలబడిపోయాడు

—ఇద్దరిలోనూ ముందు వినీల తేరుకొంది. హాస్పిటల్ బిల్ల మీద అచేతనంగా ఉండిపోయిన మనోహర్‌తో అంది—"రండి, వెడదాం, ఇక ఇక్కడ మిగిలింది ఏదీలేదు."

మనోహర్ క్షణం తర్వాత నిలబడ్డాడు—ఎక్కడికి, ఎందుకు అనకుండా వినీలరేఖతో కలిసి బయటకు నడిచాడు.

గేటుదాటాక నెమ్మదిగా అంది—"నేను మిమ్మల్ని కలుసుకోవాలనుకొంటున్నాను. ఇలా కలుసుకొన్నాను—పోనీండి. జరిగిందేదో జరిగింది. ఈ ధ్యాసలోపడి మీ జీవితం పాడు చేసుకోవద్దు. నా మీద యింకా గౌరవం అనేది మిగిలివుంటే, మన ఆర్థిక సంబంధం అలానే వుండనీయండి. మిమ్మల్ని ఓ నిండు మనిషిగా ప్రయత్నంలో నా పాత్ర నాకు గర్వం కలగనివ్వండి. లాగే నెలనెలా వచ్చి మీరు డబ్బుతీసుకెళ్ళండి"



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA133M106 |
| పుస్తకం పేరు | జ్యోతి |
| తారీఖు | 31/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 77 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | akshaya |
| పేజీలు విడదీసినది | Rukshana |
| స్కాన్ చేసినది | Ch. Ramya |
| పరీక్ష చేసినది | prathyusha |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |